శ్రీరస్తు.

శ్రీమద్వృషాద్ర్యార్యకులవతంసాక్షయ కరుణాకటాక్ష వీక్షణ
సంలబ్ధహృద్యానవద్యపద్యగద్యాత్మక బంధుర ప్రబంధ
రచనాధుర్యుండగు శేషనాథార్యవర్య విరచిత

# శ్రీమత్పర్వతమాహాత్మ్యము

ఇది

సాధనచతుష్టయసంపత్తిగల ముముక్షువుల కత్యంతోప
యుక్తమగునని యెంచి కాంచీమండలములో జేరిన
యవలూరుశ్రోత్రియగ్రామనివాసుండును అమ్మనమంచి
వంశకలశాంభోధి జైవాతృకుండును శ్రీవత్ససగోత్రుండు
ను ఆపస్తంభ సూత్రుండును సుబ్రహ్మణ్యార్య
సుపుత్రుండునునగు.

## రామచంద్రయ్యగారు

ధనవినియోగ పూర్వకముగాఁ బ్రేరేపింపఁ
దత్సహాయంబున

## చెదలవాడ * సుందరరామశాస్త్రులచే

సరిచూడఁబడి

శారదాంబావిలాస ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపంబడియె.

చెన్నపట్టణం

శార్వరి సం.

శ్రీరస్తు.



## ద్వాదశపదశార్దూలవృత్తమాలిక.

శ్రీమచ్ఛంకరభక్తశేఖరుఁడు కాంచీమండలస్థావళూ। నాఁ
మశోత్రియ పూనివాసుఁడు హృదానందైక సాంబ్రాజ్యసు।
త్రాముండమ్మనమంచి వంశజుఁడుసుబ్రహ్మణ్యాధీవర్యాగ।భాఁమం
దాంబుధి రోహిణీప్రియుఁడు శ్రీవత్సర్షిగోత్రోదయుం।దామో
దస్థిరపుణ్యకర్మనిరతుండంభోజకుందేందువా। ణీమందారసు
రద్రువిష్ణుపది డిండీరస్ఫురత్సద్యశః। శ్రీమాన్యుం డతిశాంతమా
నసికుఁడౌ శ్రీరామచంద్రాఖ్యుఁడు। ద్ధామప్రోజ్జ్వలశాలివాహ
నశకాబ్దంబుల్ పురైకాష్టభూ। నామోక్తంబగుసంఖ్యలన్నదువ
నానాగణ్యపుణ్యాపద శ్రీమచ్ఛ్రీగిరిసత్పురాణమును ముద్రిం
పించి సంప్రీతితో। భూమిన్ గోవిదులౌ ననంగఁ బ్రచురం
బున్ జేసెఁ దతాంవ్యమా। సోమార్కస్థితమై ప్రసిద్ధియగు
తన్ శోభాయమానంబుగన్॥ ❋



శ్రీ ర స్తు.

# ప్రకటన.

శ్రీమదుమారమణ విమలచరణారవింద నిష్యందమకరంద బిందుపాన తుందిలేం దిందిరాయమాన మానసులగు భక్తాగ్రగణ్యులకు గ్రన్థన సేవిన్నవించునదియెట్టులనిన- శ్రీమదఖండాద్వితీయ నిర్గుణనిర్వికార నిరతిశయాప్రమేయ నిరంజనప్రత్యగభిన్న పూర్ణసత్య జ్ఞానానంతస్వరూప పరమాత్మారోపితాత్మ శక్తివలన పంచభూతాత్మిక త్రిగుణాన్విత దృష్టప్రపంచంబు సృష్టంబయ్యె- నది- జరాయుజాండజ స్వేదజోద్భిజ్జంబుల నజతుర్విధంబుల బరిణమించె. నవియు - స్థావరములన- జంగమములన- రెండు తెఱంగులం జెలంగె- నందుజంగమప్రపంచంబు- కీటకాద్యనంత జంతుసంతానంబుల నవతరించిసంతాపంబు నొందుచుండ- (దుర్లభోమానుషోదేహః) అను వచనప్రకార మనేకజన్మార్జితాగణ్య పుణ్య పుంజ పరిపాకంబువలన- మానుషశరీరం బలవడు- నద్దానియందనాద్యజ్ఞానవశంబున ననర్గళాపవర్గమార్గంబుగన నేరకకాలక్రమంబునగు లాలచక్రంబువలె- దిరుగు పశుభ్రాతృపుత్రమిత్ర కళత్ర క్షేత్రాద్యపారసంసారపారావారంబు నందగులువడితీరంబుజేరు దారిమెఱుంగక తత్పాలనంబుకొఱకు యాచ్నా వాణిజ్య సేవకాద్యధమవృత్తులంగీకరించి- యదియె పరమసుఖంబుగా నెంచుచు నంతిమంబున నంతకశాసనంబున ననంతదురంత చింతాసమన్విత- స్వాంతులగుచు కుంభీపాకాసి పత్రదారు యంత్ర మహారౌరవాదినరకంబులనుభవించి క్రిమ్మఱ దండధరానుమతంబున పురాకృత కర్మసహాయంబుచే వసుంధరయందుదయించుచు నుందురు- ఇట్టిచోననుభవంబులగుబాల్యకౌమారాది దశావిశేషంబులువాక్రుచ్చనాతరంబె- జీవులకిట్టి జన్మంబులిన్నియని యెన్నుటకు బన్నగాధిపునకైన వశంబగునా॥ ఈవిషయమెల్ల ర

యుల్లంబులకు దెల్లంబేకదా జన్మంబులకునెల్ల నుత్తమజన్మయగు మా నుషజన్మంబెత్తినందుకు స్వోదరపూరణమునకై- యేయేకార్యంబు లా చరింపుచుండినను- (దేహికి- దేహావసానపర్యంతంబునారాయణచరణా రవిందసేవనంబుకర్తవ్యంబు)అను భాగవత వాక్యప్రకారము సత్సహా వాసమును-గురు బ్రాహ్మణవిశ్వాసంబును- దేవతాభక్తియు- సర్వకా లంబుల గలిగియుండవలయు- నట్టిభక్తింజేసి జ్ఞానంబును- జ్ఞానముంబ ట్టి వైరాగ్యంబును- వైరాగ్యమువలన ముక్తియును లభించును- ఇటుల శ్రమించినవారు పునరావృత్తిరహిత సాయుజ్యసుఖంబు లనుభవించు టకు సందియంబులేదు- కావున నిట్టిజీవన్ముక్తికి బ్రధానసాధనంబగుభ క్తి సదాయవలంబించి సమస్త పుణ్యతీర్థావగాహంబును- సమస్తదే వతాదర్శనంబును- భగవద్విలాస లాలితకథాకల్పిత పురాణశ్రవణం బును గావింపవలయు- కాశీ- గయా ప్రయాగావంతి ద్వారక హరి ద్వార గోకర్ణ విరూపాక్ష- శ్రీశైలాహోబిల తిరుమల కంచి శ్రీరం గ మధుర రామేశ్వరాది పుణ్యక్షేత్రంబు లకడకడ లెకలెకుమిక్కు టమై- పెక్కులుగలవు- ఇవన్నియు హరిహరమయంబులై సాక్షాన్మో క్షదాయకంబులై యుండినను- దర్శనమాత్ర విచ్ఛేదనపాపజాలంబు ను- శ్రీమద్భ్రమరాంబాసమేత మల్లికార్జున విహారానుకూలంబును- నగు శ్రీశైలంబు వీనికన్నిటికన్న మిన్నయైయున్నది-అయినను- నిమ్నో న్నత శైలమధ్యప్రదేశమార్గ సంసర్గంబును- వరాహఖడ్గవ్యాఘ్ర భల్లుకాద్యనేక దుష్టమృగావళిష్టంబును-నిర్మానుష్యప్రదేశంబును- చో ర సమాకీర్ణంబును నగుటను- సమస్తవస్తు సంభారంబులు-ప్రశస్తం బుగా లభింపమిని- యాత్రికులకు నత్యంతకష్టసాధ్యంబై మాఖచై త్రమాసములయందు బరంపరాజరుగుచుండు నుత్సవసమయములందు దక్కc దక్కిన కాలంబుల నమ్మంకటి చక్కటికేగుటకు శక్యంబు గాక యున్నదిగాని- యందలిదేవతా తీర్థసందోహంబుల మందము క్తిప్ర దాయకంబులై యున్నవి- ఇందుకుc బ్రమాణమే తత్పురాణమందు(శ్రీ శైలస్యసమంక్షేత్రం నభూతోనభవిష్యతి । శ్రీపర్వతసమంక్షేత్రం

రూ స్త్రీత్యాభాషతేనరః। బ్రహ్మహత్యాసమంపాపం సంప్రాప్నోతిన సంశయః। కేదారస్యోదకంపీత్వా వారణస్యామృతస్తథా। శ్రీశైలే శిఖరందృష్ట్వా పునర్జన్మంనవిద్యతే) ఇదిగాక=యనాదికాలంబున శిలాదుండనుమౌని యనేకసంవత్సరంబు లిందుధరునింగూర్చి తపంబాచరించిన నతనికి నీశుండు ప్రత్యక్షుండై యతనికోరిక ప్రకారము పర్వతనందీశ్వరులను పుత్రులనొసంగెనందు నందీశ్వరుం డత్యంతతపంబున నభవు మెప్పించి యమ్మహనీయునకు వాహనంబై ప్రమథగణములలో నొకండుగా నియమింపఁబడియె నతండు తపంబాచరించిన స్థళంబు నందిమండలమనఁ బేర్కొనఁబడె- బదంపడి పర్వతుండుసహా శివునిగురించిఘోరతపంబుఁగావించిన మెచ్చి తత్క్షణంబున ఫాలాక్షుండు ప్రత్యక్షంబైవానియభీష్టప్రకారము కైలాసాది మహాచలసంసర్గంబు నిర్గమించి భర్గుండు పర్వతాగ్రంబున నావిర్భవించె- నట్లుదయించిన లింగంబు పర్వతలింగమనఁ బ్రఖ్యాతినొందె మహాదేవసంయుక్తంబగు నప్పర్వతదర్శనంబుచేసిన మానవులు పునర్జన్మరహితులయ్యెదరు- అట్లు పర్వతునివలన వరంబుకోరబడియె- అనంతరమందు వసుమతియను మునికన్నియ యున్నగంబున విరించినిగురించితపంబుఁగావించిననతండుసాక్షాత్కరించివరంబులడుగుమనిననాయమ-వసుమతియనునామంబుపరిహరించిశుభకర నామంబొండుదయచేయుమనినవల్లెయనివాణీశుండు-శ్రీయనునామంబొసంగియదృశ్యుండయ్యెనదిమొదలా-మె-శ్రీదేవియనుపేరంబరఁగి పర్వతలింగంబును బూజింపుచుండె నట్టిశ్రీదేవి తపంబునల్పిన స్థలంబుగావున నాశైలంబు శ్రీశైలమననొప్పె నాసమీపమందుండు పట్టణమందు వసించి ప్రజాపాలనంబుసేయుచున్న చంద్రగుప్త మహారాజువలన నందాలయంబు నిర్మింపబడియె నతనిపుత్రికయగు చంద్రవతియను కన్నియ - ఆలింగమునుగూర్చి తపంబొనరించినినకరండనున్న మల్లికాకుసుమసమన్వితంబగు కుండమందు ఖండేందుధరుడు ప్రసన్నమై- మల్లికాస్రజంబులు తలయందుధరించిన నప్పటినుండి మల్లికార్జునుడను నామంబీశునకు బ్రసిద్ధంబయ్యె- న త్తీర్థంబుమ

ల్లికాకుండమననొప్పె- నీవృత్తాంత మీస్థలపురాణమందు బరిశీలించిన సవిస్తరంబుగ దెలియనగు- మఱియు- శ్రీశైలాది శేషాచలపర్యంతము- అచ్చటచ్చట ననేకతీర్థములు పార్థివములు కలిగియున్నియు- సాక్షాచ్ఛివమయములై పుణ్యప్రదములై యున్నవి. దీనికి దక్షిణద్వారము పినాకినీనదీతీర సిద్ధవటమనిన్ని- పశ్చిమద్వార తుంగభద్రానదీతీరా లంపూరనిన్ని- ఉత్తరద్వారము కృష్ణానదీతీరైలేశ్వరమనిన్ని- ప్రాగ్ద్వారము గుండికానదీతీర త్రిపురాంతకమనిన్ని- పురాణప్రసిద్ధమై యున్నది. శ్రీశైలప్రదక్షిణము చేయ సమకట్టు పుణ్యాత్ములు యీచతుర్ద్వారముద్రితమధ్యక్షేత్రముల సందర్శింపుచు తీర్థంబులగుర్తించుచు- దిరుగవలసినట్టు ప్రదక్షిణాధ్యాయమునందు జెప్పంబడియె- నింతవిస్తీర్ణముగలిగిన మహాస్థళంబెందును గానము॥ ఇందుకు బురాణమందు- (త్రింశద్యోజనవిస్తీర్ణం త్రింశద్యోజనమాయతం। పర్వతంయోజనే త్వేధం విద్ధిసర్వత్ర పార్వతి। శతకోటిసహస్రైస్తు లింగైస్సర్వత్రశోభితం। శతకోటిసహస్రైశ్చ దేవరూపైర్విరాజితం। అనేకదిశసంకీర్ణం నదీకోటిసమాకులం। చతుర్ద్వారసమాయుక్తం సర్వౌషధివిరాజితం। దివ్యౌషధైశ్చ భైషజ్యై రనేకైః పరిశోభితం। నానాస్పర్శశిలాభిశ్చ జ్వలంతీభిర్విచిత్రితం) అని యిటులలోకప్రసిద్ధమై సద్యోముక్తి ఫలకారణంబై యున్న యీ క్షేత్రమును సందర్శింపవచ్చి- ఇక్ష్వాకు- శ్రీరామ- ధర్మరాజ-విక్రమార్కాది మహారాజులు- ఆయాయుగంబులయందు వారివారికిదోచినపగిది గోపురప్రాకారాదికంబులు నిర్మింపించిరి - ఇటీవల- అనవేమారెడ్డిగారు- తద్దాలయప్రాకారాదులపై బంగారునీరుపోయించిరి-పిదపకృష్ణదేవరాయలు- గోనబుద్ధారెడ్డి- అక్కన్నమాదన్నగార్లవల్ల కొన్నికొన్ని పనులుచేయించబడియె- చందులాలాగారు సోపానములు సహా కట్టించిరి- ముందొకసారి యిందుధనమున్నది గ్రహింపవలయును అని తుకోసచివుడను నొకదుర్మార్గుడు తనపరివారయుతముగా వచ్చి ఆలయములో త్రవ్వింపుచుండిన నందుదపంబుచేయుచుండు నొకకవిగ్రామణి- విషమాక్షరప్రయోగముచేసి (మునుపొకకేల రావణుడు మో

దమునం రజతాద్రిమొత్తివం। తనె హరుడప్పుడే తనపదంబునద్రొక్కి-
మదంబడంచెగా । వనమయగారి తుక్కిసచివాయల (శ్రీగిరి గడ్డపార
లక్ష। గనబుచుద్రివ్వి సర్వమును గైకొననీకిపుడాతడోపడే॥) అనుపద్య
ము చెప్పినవాడు మడసెనట- తక్కినవారు భయపడపాఱిరట- ఇప్పటికి
షుమారు ౩౦ సంవత్సరములక్రిందట- అరబ్బీలువచ్చి యచ్చట ద్రవ్యము
న్నది చేకొనవలయునని కొన్నికొన్నిస్థలములకు చెరువుకలుగజేసిరిగాని
తన్మహాత్మ్యమువలన వారియభిమతము నెరవేరదయ్యె- ఇమ్మహాస్థలము
నకు ధర్మాధికారము శ్రీమచ్ఛంకరాచార్యస్వామివారిదై యున్నది - అ
క్కడ వుత్సవాదికార్యములుజరుపుటకుగాను వారివల్ల గొందఱుకంట్రా
క్టుపొంది స్వార్జితముచేయుటయేగానియక్కడజరుగులోపాలోపము
లు బాగుపఱచరైరి- ఇంప్పడాయధికారము - శ్రీమదచ్యుతస్వామివారు
పొంది యక్కడఁ వచ్చుద్రవ్యములో కొద్దిగా పనులుచేయించుచున్నా
రు॥ ఇట్టి పురాతనపుణ్యస్థల మహిమలు పార్వతీదేవికి బరమేశ్వరుడు చె
ప్పమం? సనత్కుమారుండనుమునివిని వేదవ్యాసులకుపదేశించె నమ్మ
హనీయుండష్టాదశపురాణములు రచించుచు దీనినిసహా రచియించిరి ఇది
స్కాందపురాణాంతర్గతమై శ్రీశైలఖండమని పేర్కొనబడి అరువదినా
లుగధ్యాయములుకలదైయున్నది- ఇట్టి వేదవ్యాసప్రోక్తమై- పఠనశ్రవణ
మాత్ర నిశ్శ్రేయసప్రాప్తిహేతువైయున్న ప్రబంధంబు- ముద్రాక్షరాం
కితము కాకుండుటంబట్టి. యెల్లరకువెల్లడికాదయ్యె. ఇదివారికి లభించిన
దికాదు. ఈపర్వతప్రాంత గ్రామములయందు . కొన్నిచోట్ల తాళప
త్రలిఖితమై బహుగోప్యముగానుంచబడినదిగాని. అంతటను లేదు. అట్టి
గ్రంథము నేనొక్కటియార్జించి లేఖకప్రమాదాదిదోషంబులులేకుం
డ బరిష్కరింపించి ముద్రింపించుచున్నాడను. అచ్చుముగియుటతోడనే
ప్రచురింపఁబడును. దానిని యథాయుక్తముగా బరిశీలించి పఠనగా
వించిన దన్మహిమలు గరతలామలకముగాగలవు. ఇదిముద్రింపించుటకు
గాను నావల్లవ్రయుపడిన ద్రవ్యమునకు సరిపడేక్రియముతోడే యివ్వ
బడును గానవలయువారలు. కార్డుమూలముగా నాకువ్రాసి తెప్పించు
కొనవలయును.

ఇదిగాక మాఘకృష్ణచతుర్దశీశివరాత్రికి తత్సేవాపరతంత్రులై
వచ్చుబ్రాహ్మణాదిజనంబులు పోవునప్పుడు వచ్చునప్పుడు మార్గమధ్య

మందుద్రవ్యలోపముచేతఁ బదార్థలోపముచేతఁ బరికరణలోపముచేత బధాయాసముచేతనన్నపానాదికములకుమిక్కిలి శిక్షించుచున్నందున నట్టిస్థళమందు తైర్థికసౌఖ్యముకొరకు నేనారోజులలో సత్రమొకటియేర్పరిచి అన్నపానములు చక్కగాజరిపించునటుల గొంతయేర్పాటుచేసియుంటిని-యీశ్వరకృపవల్ల నారంభించినది మొదలింతపర్యంతమది నిర్విఘ్నముగా నెరవేరుచున్నది.అయినను-యిమ్మహత్కార్యము బహుకాలమజరుగునటుల జేయుటకును-స్వామియాలయమందుఁ బ్రకృతము నష్టపడినపనినికొంతవరకుబాగుపరచుటకును-నాకుసంకల్పముకలిగియుండినను స్వల్పజీవస్థుఁడనుభారికుటుంబీకుఁడను-అయినందున దగినద్రవ్యోపపత్తి లేకయున్నది- కాబట్టి యీపత్రికను చిత్తగించిన సత్పురుషులందరు పుణ్యసాధకమైన యీకార్యమును శిరసావహించివారివారికి నీశ్వరప్రేరణయయినమట్టుకు మానసోత్సాహముగా సహాయముచేసి యీయఫలమును జెందవలయునని ప్రార్థించెదను.

ఈస్థళమందు త్రికరణశుద్ధిగా యత్కించద్వినియోగముచేసి నా ఫలమనంతమై యుంచున్నది. సందియము లేదు॥ పురాణమందు॥

(వటబీజవదుత్కృష్ట మనంతఫలదాయకం। ప్రయాగేభోజయేద్యస్తు లక్షసంఖ్యాద్విజోత్తమాన్। గ్రాసేనైకేనతత్పుణ్యం శ్రీగిరౌలభతేనరః॥ వారాణస్యాంయదాప్నోతి ద్విలక్షబ్రహ్మభోజనం। గ్రాసేనైకేనదత్తేన శ్రీగిరౌతత్ఫలంలభేత్ । గంగాయాంసప్తలక్షాణాం బ్రాహ్మణానాంచభోజనాత్। యత్ఫలంతదవాప్నోతి శ్రీశైలేగ్రాసమాత్రతః॥ ప్రియాగేలక్షభోజ్యంస్యాత్సమంకాస్యాద్విలక్షకం। గయాయాంసప్తలక్షంచ గ్రాసమేకంతుశ్రీగిరౌ । తత్రయస్త్యజేద్దేహం అంత్యజాతీనరోత్తమః। స్మరంచేతసిసర్వేశం భక్త్యాశ్రీమల్లికార్జునం॥)

ఇత్యాదిప్రమాణములు చక్కగాగమనించగోరెదను.

---

ఇట్లు-తమవిధేయుఁడు.
అమ్మనమంచిరామచంద్రయ్య-
కంభంతాలూకా గుమాస్తా.

సమాప్తము.

శ్రీ

## విషయసూచిక.

### ప్రథమాశ్వాసము.


| | పుటసంఖ్య. |
|---|---|
| గ్రంథప్రశంస. | ౩ |
| కవితాప్రశంస. | ౪ |
| కృతిపతివర్ణనము. | ౫ |
| షష్ఠ్యంతములు. | ,, |
| కథాసంగ్రహము. | ౬ |
| సనత్కుమారునియొద్దకు వేదవ్యాసుండువచ్చుట. | ౮ |
| వ్యాసుండు సనత్కుమారునిఁ బుణ్యక్షేత్రంబులఁ దెల్పుమనియడుగుట. | ౯ |
| శ్రీపర్వతక్షేత్రంబుత్కృష్టమనిసనత్కుమారుండు చెప్పుట. | ౧౦ |
| ఆశ్వాసాంతము. | ౧౩ |


### —(*) ద్వితీయాశ్వాసము. (*)—


| | |
|---|---|
| శ్రీశైలంబునంగల మాహాత్మ్యంబులఁ దెల్పుట. | ౧౪ |
| కైలాసంబుననీశ్వరుండు కొలువుదీరియుండుట. | ౧౫ |
| శ్రీనగంబునశివుండు నిల్చుకారణమును పార్వతియడుగుట. | ౧౬ |
| శిలాదమౌని తపంబు చేయుట. | ౧౭ |
| శిలాదునకు నీశ్వరుండు ప్రత్యక్షంబగుట. | ౧౯ |
| శిలాదుఁడభవుని మెప్పించిపర్వతనందీశ్వరులఁబుత్రులఁగాఁబడయుట. | ౨౧ |
| నందీశ్వరుండు హరునిఁగూర్చి తపంబుచేయుట. | ,, |
| ప్రత్యక్షంబైన యీశ్వరుని నందీశ్వరుండు స్తుతించుట. | ౨౩ |
| శివుండు నందీశ్వరుని వాహనంబుగాఁ గొనుట. | ౨౫ |
| పర్వతుం డత్యుగ్ర తపంబు సల్పుట. | ,, |
| సాక్షాత్కరించిన శంభునిఁ బర్వతుండు స్తుతించుట. | ౨౭ |
| మహాదేవుండుపర్వతునిభక్తికిమెచ్చియతనియందావిర్భవించుట. | ౨౯ |
| హరిబ్రహ్మాదులు పర్వతలింగంబును బరివేష్టించి కొలుచుట. | ౩౨ |

పుటసంఖ్య.

బ్రహ్మాదులు పర్వతుని శ్లాఘించుట. ౩౩

ఆశ్వాసాంతము. ౩౪

—(*) తృతీయాశ్వాసము. (*)—

పర్వతశిఖరాష్టకతీర్థతన్నామతత్ఫలంబులం దెల్పుట. ౩౬

కార్తికాదిమాసంబునందు శ్రీగిరికేఁ జనిన కలుగుఫలములు. ౩౮

శ్రీశైలతీర్థమాహాత్మ్యంబులు సనత్కుమారుండు కృష్ణద్వైపాయనునకుఁ దెల్పుట. ౪౦

సర్వేశపుష్కర నదులమహిమ. ౪౩

శ్రీగిరిచతుర్ద్వారనిర్ణయము అందలిదేవతాతీర్థములమహిమము ౪౬

ఆశ్వాసాంతము. ౪౮

—(*) చతుర్థాశ్వాసము. (*)— ౫౦

చంద్రవతి పర్వతేశ్వరుం బ్రస్తుతించుట. ౫౨

చంద్రవతీకన్య పూఁదోఁట కట్టుగుట. ౫౬

వసంతఋతువర్ణనము. ,,

చంద్రవతీకన్య సఖులుం దానును శివపూజార్థము పూలుగోయుట. ౫౮

చంద్రవతి తీర్థంబులు దర్శించుచు వానిం బ్రశంసించుట. ౬౦

చంద్రవతి పర్వతలింగంబుఁ బూజించుట. ౬౧

చంద్రవతి పర్వతేశ్వరుని స్తుతించుట. ,,

చంద్రవతి పర్వతేశ్వరునియెదుట గానముచేయుట. ౬౩

చంద్రవతికిఁ బర్వతేశ్వరుండు ప్రత్యక్షమగుట. ౬౫

చంద్రవతి ప్రార్థనంబునఁ బర్వతేశ్వరుండు మల్లికార్జునలింగనామంబుఁ దాల్చుట. ౬౬

—(*) పంచమాశ్వాసము. (*)—

శ్రీపర్వతంబునందలి మూఁడువృక్షంబులమహిమ నభివర్ణించుట. ౬౮

సాధకుండు మోహినియను గజంబునుజూచుట. ౬౯

పుటసంఖ్య.

సాధకుండు భైరవునిం జూచుట. ౭౦

సాధకుండు తపస్వినింజూచుట. ,,

సాధకునకు తపస్వి బిలవృత్తాంతంబులం జెప్పుట. ౭౧

కరవీర వనప్రశంస. ౭౨

ఈశ్వరుని కరవీరుండు స్తుతించుట. ,,

తపస్వితన్నుచెట్టుగాజేసిపువ్వులుగోయించిపూజగైకొమ్మనికోరుట. ౭౫

తృణబిందు సరోవర ప్రశంస. ,,

శంకరిపట్టణనామప్రశంస. ,,

వృషభ బిలవృత్తాంతము. ౭౭

తాళవృక్షప్రశంస. ౭౮

బాలబిలప్రశంస. ౮౧

ఖేచరబిలప్రశంస. ౮౨

భైరవబిలప్రశంస. ౮౩

—(*)షష్ఠమాశ్వాసము.(*)—

చేళికాబిలవృత్తాంతము. ౮౮

కదళీవనప్రశంస. ౯౦

ప్రమథ కదళీవన వృత్తాంతము. ౯౩

పద్మవతీబిలప్రశంస. ౯౫

విషయసూచిక సమాప్తము.





శ్రీ ర స్తు.

శ్రీశైల మల్లికార్జునస్వామినే నమః.

అవిఘ్నమస్తు.

## శ్రీ మ త్ప ర్వ త పు రా ణ ము ✽ ప ద్య కా వ్య ము.

శా॥ శ్రీమత్పర్వతరాజరాజ్యపదవీసింహాసనస్థుఁ డజగ । ద్ధామగ్రామణి మల్లికార్జును నపాంగవ్యాప్తి లోకక్రియా । సామర్థ్యుఁ దుహినాద్రిజాకుచతటీసందీప్తకాశ్మీరసాం । ద్రామోదాన్వితవామభాగు శివు నారాధింతు డెందంబునన్॥ (శా) లాలిత్యంబు ననంతకోటిమదనాలంకార ధిక్కారమై । ప్రాలేయాద్రిజకున్ ముదంబొసఁగఁగాఁ బాతాళగంగానదీ । ఖేలోత్తుంగతరంగసంగతజలక్రీడాకళాడంబర । శ్రీలన్ జెంది సుఖించు దేవుఁ గొలుతున్ శ్రీపర్వతాధీశ్వరున్॥ (శా) హస్తాలంకృతపన్నగేశ్వరసుధాహారావళీమస్తక । న్యస్తవ్యస్తకిరీటరత్ననివహాన్యాంచత్పదాంభోరుహున్ । విస్తారాంబుజసంభవాండనిజహావిభ్రాజవగభాజవహున్ । శస్త్రాకారు సమస్తలోకగురు శ్రీశైలేశ్వరున్ గొల్చెదన్॥ (శా) అల్లో నేరెడుపండువోలె నరచే నత్యుగ్రకాకోలమున్ । జోలిల్లాసంబున నిల్పి గ్రుక్కఁగొని విస్ఫూర్జత్ప్రతాపంబుతో । ముల్లోకంబుల నేలుచున్న విభునిన్ ముగ్ధేందుచూడామణిన్ । దల్లిం దండ్రియునై జగంబునకు నుద్యన్మూర్తిఁ గీర్తించెదన్॥ (ఉ) తత్తఱపాటుతో నిరులు దద్దయు నూన్పఁగఁ జాలు కన్నును । వ్రేత్తున వెల్పు మూఁకలకు విందులు పెట్టెడు కన్న దమ్మియున్ । మొత్తమిన తల్లిచ్చికిని ముమ్మఁగఁ బుట్టిన ముద్దుపట్టి మే । నెత్తిలఁ జూచు కన్ను గల యొట్టెడి వేలుపుఁ గొల్తు నిచ్చలున్॥ (మ) శుభవాజుల్ సకిలింపఁ బ్రాఁజదువులై శోభిల్లఁగాఁ జేరి పై । ఘనకీర్తిఁ బసిండి సింగిణి కళల్ రంజిల్లఁగాఁ గౌస్తుభ ప్రభల న్వంచన చేయు న

ల్గని కళాస్త్రం బేచిఁ సంధించి శ! క్తిభరప్రౌఢిఁ బురంబులన్ గాలు
చు నద్దేవున్ బ్రశంసించెదన్॥ (సీ) మండనం బేదేవు మకుటాగ్రవీధికి
రాజతుహిమద్యుతీరమణఖండ।మేదేవునకు వేల్పు టేటి జటాజూటపుష్పి
తవిచకిలస్ఫురితకళిక। తరళసహస్రరత్నప్రభారింఛోళి పాదాంగదంబు
ఏప్రభువునకును । ఏదేవు గళమున హాలాకలాపంబు కాలాగ్నిచీలిమ
కాళిమంబు।అట్టి దేవుని నిజదరహాసలబ్ధ। సతతకల్యాణకారణోత్సవస
మగ్ర।వాగ్రమాధీశసకలపై భవుని భవుని। భక్తి సేవింతు భావింతుఁ
బ్రస్తుతింతు॥(కందము)కంజాసనాదివంద్యుని । మంజులనిర్వక్రవిక్రమక్ర
మకేలా। రంజను దక్షాధ్వరసుర।భంజను శ్రీతోటవీరభద్రు నుతింతున్॥
(శా) ధీమత్తాపసమానసాబ్జసదనున్ దేవేంద్రముఖ్యామర । స్తోమస్తు
త్యుని భక్తిభావకలనాశుద్ధాంతసంరక్షకున్। శ్రీమత్పర్వతపుణ్యగేహానిల
యున్ శ్రీతోటవీరేశ్వరున్ । గామింతున్ వినుతింతు భక్తిఁ గొలుతున్
గామ్యార్థసంసిద్ధికిన్॥

(క) సరసిజగర్భముఖాఖిల। సురసిద్ధకిరీటకోటిశుభమణిరాజ। స్ఫు
రదంఘ్రికమల నిర్జర।పురుహూతా శ్రీనగేశపురవీరేశా॥(శా)ఆస్ఫోటిం
చిన దైత్యగర్వతిమిరం బశ్రాంతమున్ మాన్ప వాప్రస్ఫీతాసిధనుఃకుఠా
రశిఖరప్రాసాదశస్త్రప్రభా।విస్ఫూర్తుండల్ కరపఙ్క్తులన్ మెఱయఁగా
విశ్వామరతారణా।ర్యస్ఫారుండగు నాగులూటివనవీరస్వామిఁ గీర్తింతుఁ
జెదన్॥ (శా) లాలిత్యంబుగ భక్తిపక్షములచే లంఘించి మాహేశభ।
క్త్యాలంకారితనైవధమణివిటపాగ్రస్థాయియై శంభుగో। పాలుంగూడె
డి సంగమేశు బెరయన్ బంచాక్షరీకూజనం। బాలోకించు విరక్తి కీరము
వృషాధ్యక్షున్ బ్రశంసించెదన్ ॥ (వచనము) అని శ్రీమహాదేవు భ
క్తితాత్పర్యచర్యాయత్తచిత్తుండనై మామకీయాంతరంగంబుననిట్లని వి
తర్కించితి ॥ ( శా ) నావారున్ గడుఁ జిన్ని ప్రాయమున నో
నామః కులంక్షేమతో । శివాయః కులఁ జెప్ప నాటఁ గొలెనే సే
వింపనియ్యాననా । భావం బందును నిన్ను నెన్నఁదును నన్ భ్రాజద్భ

వద్భక్తిసం । భావజ్ఞానసుధానుభావరతుఁగా భావింపు మల్లీశ్వరా॥ (మ) శివచారిత్రము బీజ మంకురము నీసేవావివేకంబు స । తత్కవితాశ్రేణులు పల్లవంబులు సమాఖ్యావ్రాతముల్ పుష్పముల్ । భవదీయ స్తవముల్ ఫలావలులు తద్భావజ్ఞులే కీరముల్ । భువి మత్కావ్యమహీరుహంబునకు శ్రీభూభృత్సుతాధీశ్వరా॥ (మ) భవదీయ స్తవ మెట్టులల్ప మగు మత్ప్రాగల్భ్య మెట్లంచు నే । వివశత్వంబున శంక నొందుదును సంవిద్భక్తి బోధించి యు । త్సవభావంబున శంక మాన్చి మృదులస్ఫారార్థవాగ్వైఖరీ । నవపద్యవ్రజ పుష్పమాలికల నిన్నర్పింతు మల్లీశ్వరా॥ (సీసము) వర్ణింపఁగంటి దుర్వచనమార్గము దాఁటి కమనీయశివకథాకథనమహిమఁ । బ్రణుతింపఁ గంటి దుర్భవమదేభము గెల్చి శ్రీకుంభినీధరశిఖరమహిమ । గణుతింపఁ గంటి దుష్కలుషపంకము బోవ నంబికాధవు నుపాఖ్యానమహిమ । వినుతింపఁ గంటి వివేకపద్ధతిఁ గాంచి భూధరేశ్వరమూర్తి పుణ్యమహిమఁ । జాల ధన్యుండ నైతి సంశయము లేదు । భక్తిపుంగవు శ్రీగిరిఁ బ్రస్తుతింపఁ । గంటి శ్రీమల్లికార్జునకరుణ నాకు । సంభవించెను జన్మంబు సఫల మయ్యె॥ (క) శివజన్ముఁడ శివగోత్రుఁడ । శివలింగధ్యానపరుఁడ శీలవ్రతుఁడన్ । శివపూజాపరతంత్రుఁడ । శివయోగసుధానుభవుఁడ శేషాహ్వయుఁడన్॥ (మ) ప్రణుతశ్రీగిరినాథలబ్ధకవితాప్రజ్ఞాకలాభిజ్ఞుఁడన్ । గణభృద్గ్రంథమతప్రయోగవిలసద్గాథార్థవేత్తృత్వలస । త్ఫణి

## —(*) గ్రంథప్రశంస. (*)—

భాషాయుతభక్తికాదృఢపదప్రౌఢీసమాసోచిత । ప్రణిపత్తిస్ఫుటశబ్దశాస్త్రనివహప్రావీణ్యపారీణుఁడన్॥ (ఉ) శ్రీగిరినాథు సన్మహిమఁ జెప్ప నశక్యము బ్రహ్మకైన భూ । భాగములోని మానవులు ప్రస్తుతి సేయఁగ నెట్లు నేర్తురా । సాగరవిశ్రుతోన్నతులు చర్చలు చేసినఁ జెప్పనేర్తునే । సాగరమంతె కాక యొక సారి తటాకముఁబోల్పఁ గూడునే॥ (క) లలిత శ్రీగిరిమహిమల । చెలువము లోక

నోర నొకఁడు చెప్పంగలఁడే । యల రెండు వేల జిహ్వలు । గలి
గిన శేషునకు నెన్నఁగడు దుర్లభముల్॥ (శా) ముఖ్యార్థోచిత
సూక్తులన్ మెఱయుచున్ మోదించి వాణీ సదా। సౌఖ్యశ్రీనిధి మల్లికా
ర్జునగురుస్వామిన్ బ్రశంసించెదన్ । బ్రఖ్యాతోజ్జ్వలమస్తకాగ్రకట
జస్రీద్యోతితస్వర్నదీ । సఖ్యశ్వేతకళాకలాప శశభృత్సమ్యగ్జటా జూ
టునిన్॥ (వ, అని ప్రబంధకల్పనారంభకలనాయత్తచిత్తుండనై॥ (క)

—(*) కవితాప్రశంస. (*)—

నిగుడునవరసములును ద । ద్విగుణంబగు వర్ణనములు దీపింపఁగఁద।
ద్విగుణాలంకృతులును ద । ద్విగుణములగు నర్థభావవిధములు గలు
గన్॥ (క) తెనుఁగైన నేమి కవితా । జనితాలంకారచిత్రసంగతప
దవ । ర్ణనవచనరచనచతురత।వినయోగ్యంబైన కృతియు వింద్రుడు మ
హాత్మల్॥ (మ) దోషయుతంబు నెంతయును దొడ్డది యైనను నిందితం
బు ని । దోషము కాంచెమైన జగదున్నతిఁ బొందుఁ గళంకహీనస।
ద్వేషశశాంకఖండమును విశ్వవిభుండు కిరీటకోటిపై । భూషణలీలఁ దా
ల్చి నలపూర్ణశశాంకు ధరింపఁ గోరునే॥ (క) భూషణలీలల దేశ
వి । భాషలు తత్తత్ప్రదేశభాషణము లగున్ । భూషించు పత్త్రము
ట్లసు । భాషితమై సంస్కృతంబు బహుదేశములన్॥ (చ) జనని స
మస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్ । ఘనలలితార్థ
గౌరవవికాసి తెనుంగభిరమ్య మంతకున్ । గనుఁగొనఁ జాతబీజము
నకంటెను గోమలపత్త్రపుష్పశో । భనవపల్లవాభినవ బాలరసాల
ము సొంపు నింపదే॥ (ఉ) జల్లియు నక్రమంబునపశబ్దము వైరి
పదంబు జడ్డునన్ । బొల్లయు గ్రామ్యకంటకముఁ బూరకముల్ వి
రసంబు జోళిగా। నల్లిక లల్లు కబ్బములు నాదర ణీయమె వాక్యచాతు
రీ। సల్లలితార్థసృష్టి గల సత్కృతి సేవ్యముఁ బొందు కైవడిన్॥(మ)
స్వరసాలంకరణోపమానకవితాసంధిక్రియాచాతురీ। భరితప్రౌఢి రచిం
చు సత్కవి జగత్ప్రఖ్యాతి వర్ణింపఁగా। గరిమం బేలుచు దుస్సమా

ననిపుణుల్ గర్వింతు రల్పజ్ఞులై। హరి యుండఁగ హరినామభేకతతుల
య్యబ్ధిం బ్రలాపింపవే॥ (ఉ) మేదురచాతురీమృదుల మిశ్రవిచిత్రకవిత్వ
తత్వస। మ్మోదరసజ్ఞతానురతి మూధుఁ డెఱుంగునె ప్రాజ్ఞు కైవ
డిన్ మీఁదటియాకులు న్మెసఁగు మేష మెఱుంగునె యిక్షుఖండికా।స్వా
దరసానుభావమును సాంమజేభ మెఱుంగు సంగతిన్॥ (ఉ) వారిజగ
ర్భుఁ పత్ని పదవారిజసన్మధుమాధురీధురీ। స్ఫారకవిత్వతత్వమును బ్రా
జ్ఞుని కైవడిఁ గూళ మెచ్చునే। సారపయోధిజాత సరసత్వవిశిష్టరచంద్ర
చంద్రికా। పారమయూఖ రేఖలకుఁ బ్రైకొని యుబ్బునె యుప్రకూప
ముల్॥ (ఉ) దూషణ మేల చేయ నల ఘాతుకాల నిష్ఠురపక్షదుర్వచో।
దూషితసజ్జనుల్ వినుఁడు ధూర్తనికాయము మీకు నాత్మసంతోషయ
శోవిశేషజగదున్నతహేతువు గాదె ధాత్రిపై। నూసరదీర్ఘికల్ గలు

—(*) కృతిపతివర్ణనము. (*)—

గ నున్నతిఁ బొందవె చారుదీర్ఘికల్॥ (సీ) ఏదేవదేవుని యిచ్చలో వి
హరించు వారిజాసనుఁ డశ్వవాహనుండు। వలగొని యేదేవు వస్త్రం
బు భండార మింటి కాపుండుదు గింద్రముఖ్యు। లేమహాదేవు మహాష్ట
భూపాలికిఁ బాతాళభువనంబు బహుళ పేటి।భాసిల్లు నేదేవతాసార్వ
భౌముని కసముద్ధాంభోధి యస్త్రశాల। యట్టి దేవుని సర్వేశు నఖి
లవర్తి। లలితశుభమూర్తిఁ గరుణాకళాప్రమూర్తి। శకనినుతకీర్తి
శ్రీలింగచక్రవర్తిఁ। బర్వతాధీశు మత్కృతిప్రభు నుతింతు॥ (వ) అని
ప్రబంధం బాంధ్రభాషానుబంధంబుగా నాయొనర్పం బూనిన శ్రీపర్వ
తపురాణాధీశ్వరునభివర్ణించెద॥

షష్ఠ్యంతములు.

శివునకుఁ బంకజగర్భా। ద్యవధీశున కఖిలదేవతావంద్యునకున్।భవు
నకు హిమగిరిపుత్రీ। ధవునకుఁ గైవల్యరాజ్యచింతామణికిన్॥

శంసితమునిహృదయసరో। హంసమునకు శివున కంధకాసురమదవి।
ధ్వంసునకు శీతభానువ।తంసున కచలాధినాథతనయేశునకున్॥ ౨॥

అస్తంగమితస్మరునకు। మస్తకమాణిక్యకిరణమయమకుటతట। న్యస్తా
మరసింధువునకుఁ। బ్రస్తుతరణబంధునకును బరమేశునకున్॥ ౩॥

కణాలంకృతఫణికిసు। వర్ణాచ కార్ముకునకును వామాంగునకున్।
స్వర్ణాగనిభాంగునకు న। పణాధీశునకు శైలపతిభవనునకున్॥ ౪॥

కింకుర్వాణమరుద్గణ। పంకేరుహసంభవునకుఁ బ్రఖ్యాతమహా। హం
సర్వాణాహితమద। పంకాహఃపతికి శైలపతిభవనునకున్॥ ౫॥

గీర్వాణవినుతపదునకు। నర్వాచీనప్రభాయితాకారునకున్। ఖర్వేత
రచామీకర। పర్వతనిలయునకు శైలపతిభవనునకున్॥ ౬॥

శీలాన్వితభక్తమనో। నాళీకాసనున కర్ధనారీశునకున్। లాలాసుర
మదహరునకుఁ। బాలితదివిజునకు శైలపతిభవనునకున్॥ ౭॥

కంఠీరవాఖ్యవిక్రమ। కుంఠనునకు కుంభిదైత్యకోపాటోపా। కంఠప్ర
తాపహరునకుఁ। గంఠేకాళునకుఁ బ్రమథగణపాలునకున్॥ ౮॥

(*) కథాసంగ్రహము. (*)

(వచనము) అంకితంబుగా నాయొనర్పం బూనిన శ్రీశైలమా
హాత్మ్యంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన శిలాదుండను మునీంద్రుండు పు
త్రార్థియై తపంబు చేయుటయు నమ్మునీంద్రుని తపంబునకు మెచ్చి శ్రీ
మహాదేవుండు నందీశ్వరుని శ్రీపర్వతునిం బుత్రులుగా ననుగ్రహింపుట
యు నందీశ్వరుండు తపంబుచేసి పరమేశ్వరుని మెప్పించి ప్రమథాధిప
త్యంబును ఈశ్వరునకు నిజవాహనత్వంబునుం బడయుటయును బర్వ
తమునీంద్రుండు తపంబుచేసి పరమేశ్వరు మెప్పించి ముజ్జగంబులం గల
పుణ్యతీర్థంబులు పుణ్యపర్వతంబులుం దన మీఁద మూర్తిమంతంబులై
యుండను వరంబును సకలదేవతాసహితుండై పరమేశ్వరుండు పర్వత
లింగనామంబునఁ దన శిరంబున సదాసన్నిహితుండై యుండ వరంబు
ను వేఁడిన నమ్మహాదేవుండు ననుగ్రహింపుటయును వసుమతి యను మ
హాపుత్రి యప్పర్వతంబునఁ దపంబుచేసి శ్రీనామంబు వడసి సీమాలంఘన
రహితంబున నందు మోక్షంబు వడయుటం జేసి శ్రీపర్వతంబను నామంబు

కలుగుటయును చంద్రగుప్తుం డను భూమీశ్వరుండు దనపుత్రియైన చం
ద్రవతిం జూచి మోహించిన నతని యంతరంగం బెఱింగి తొలంగి యా
చంద్రవతీకన్య సఖులుం దానును శ్రీపర్వతంబున కరిగి పర్వతలింగంబును
మల్లికాపుష్పంబులం బూజించి గానవిద్యావిలాసంబున హృదయంబుఁ
గరఁగింప మెచ్చి యమ్మహాదేవుండు వరంబు వేఁడుమనినఁ దాఁ బూజిం
చిన యర్జునవర్ణంబైన మల్లికాదామంబు పేర మల్లికార్జుననా
మం బవధరింపవలయు నని వరంబు వేఁడిన నమ్మహాదేవుండును మల్లి
కార్జునలింగనామం బవధరించుటయును శ్రీశైలంబునందుఁ గల గం
గాదితీర్థంబుల మాహాత్మ్యంబులును శక్తిశివలింగస్థానంబుల యందలి
శివలింగపూజాఫలదర్శనమాహాత్మ్యంబును అష్టశిఖరంబుల ప్రశంస
యు శ్రీశైలచతుర్ద్వారంబులం గల శక్తిశివలింగస్థానంబులును అం
దుల తీర్థవిశేషంబులును శ్రీశైలంబున కరుగు మాసఫలంబులును అం
దుల శివలింగతీర్థమహాత్మ్యంబులును తత్సాధకఫలవిశేషంబులుం జె
ప్పిన ముప్పదిరెం డధ్యాయంబు లందును పండ్రెండువేలు న్నేనూఱు
గ్రంథంబును సనత్కుమారుండు వేదవ్యాసునకుం జెప్పిన శ్రీపర్వత
మాహాత్మ్యంబాంధ్రభాష నేనొనర్పం బూనిన కథావిధానం బెట్టిదనిన॥
(మ) పరమస్కందపురాణసంహితలలోఁ బంచాదశాఖ్యానమున్। వ
రుసన్ జూచుచు నందు శ్రీగిరిమహాత్మ్యం బైహికాముష్మిక । స్ఫురణా
నందకరంబు భవ్య మనుచున్ బుణ్యప్రబంధంబు నే । విరచింతున్ బద
బంధబంధురకళావిర్భావవాగ్వైఖరిన్॥ (శా) గంగాతీరపవిత్రసైకత
చమత్కారంబుగాఁ బ్రస్తుతోత్సంగంబై వటబిల్వపిప్పలతరుచ్ఛాయాప
రిశ్లాఘ్యమై। రంగత్ప్రక్రియ మంత్రపూతమగు భారద్వాజమౌనీంద్రుప।
త్సంగస్థానమునందు బ్రహ్మసుతుఁడు త్సాహంబు సంధిల్లఁగన్॥ (సీ) త
రుచైన మాలూరతరువాటికాంతారసైకతవేదికాస్థలులయందు । గం
గానదీశైకాంతభూములయందుఁ జిత్రసింహాసనాసీనుఁడగుచు। సమ
ధికప్రజ్ఞావిశాలభాషాపుణ్యగోష్ఠివినోదంబు కొనలు సాగ । శివపురా

ణాగమసింధుపీచికలలో లాలితోత్సవలీల నోలలాడి। సకలమునివర శ్రే
ణికాసహితుఁ డగుచు। మహిమ దీపింప వైధాన్య వాసివరుఁడు। మృ
దులభాషల సంతోషహృదయుఁ డగుచు। వివిధ వేదాంతసూక్తులు వి
స్తరింప॥ (సీ) మైత్రాయణీయంబు మండూకశాఖ్యేయసామాయణీయా
దిశాఖలందు। వాత్సాంత పేయంబు వైనేయశౌనకశ్యాపాయనీయాది
శాఖలందు। గాపాలవారాహగణసురాణీయచరకకాత్యాయన శా
ఖలందు। వైధేయముద్గలవారాసురాణాదిశాలీయభాష్కలశాఖలం
దుఁ। దదుపశాఖాదిసూక్తప్రధానపఠనఁ। బరఁగి వేదాంతసూక్త
లుపన్యసింప। ఖండనాఖండనోద్దండగరిమమెఱసి। వేదభాష్యంబుఁ జె
ప్పుచు విధిసుతుండు॥ (వ) ఇట్లధివసించిన సనత్కుమారునాశ్రమంబున

—(*) సనత్కుమారునియొద్దకు వేదవ్యాసుండువచ్చుట. (*)—

కుం గృష్ణద్వైపాయనుండు శిష్యపరివృతుండై యేగుదెంచి॥ (సీసము) ప
రిస్ఫుతాలంకారభసితత్రిపుండ్రముల్ ఫాలభాగంబులఁ బరిఢవిల్ల। రు
చిరమంత్రపూతరుద్రాక్షమాలికానివహంబు మేనుల నిండఁదాల్చి భా
స్వజ్జటాజూటంబు లయ్యవటుస్థలంబుల నర్తమిల్లఁ। గటితత
టంబుల నీరుకావిదోవతు లూన్చి సజ్జలశివలింగసమితిఁ దాల్చి। ముద
ముఁ దేజంబు మెఱయంగ మునిజనంబు। లుభయపార్శ్వంబులనువి శే
షోక్తులం ను। జీవపరమాత్మతైక్యకసిద్ధమైన। తత్త్వమస్యాదిసూక్త
లందఱు పఠించి॥ ఉ) కిన్నరకామినీసురతఖేలపరిశ్రమవారిఁ దోఁగి యు।
త్పన్నతమల్లికావకుళయూథవధూజనమంజరీవ్రజా। భిన్నకుచంబు లం
టి ముఖబృందముఁ మీఁద సుమాళి ముప్పఁగాఁ। గొన్నిన్నవిల్తు సేనకె
లగోలుగ నేగె సమీర మింపుగన్॥ (వ) అంతటఁ గిటికిరటిఘుటాకఠోర
ఘుంకారనాదంబులును వాతప్రమీదాత్యూహనిష్ఠురపటిష్ఠధ్వానకోలా
హలంబులును మార్జాఘూటనిరాఘూటకహాకహారావకలకలంబులును భ
ల్లూకనివహాశీఘ్రాటోపఘుమఘుమధ్వానంబులును బుంస్కోకిలవ్యూదుల
కంటకాకుహారకుహూంకారంబులును ఘూర్ణిల్లుచు దికుద్దుంగంబు

లఁ బ్రతిధ్వానంబులీన నానాద్రుమలతా కీర్ణంబులైన దివ్యాటవి నే తెంచె నంత॥ (శా) శాకోటార్జునమాతులుంగఫలినీజంబీరజంబూవ నీ। మాకందారగ్వధకదంబనింబకదళీ మల్లీమతల్లీలతా । నేకానోకహపల్లవాంకురతలో న్మీలత్ప్రసూనోద్గమా। నీకశ్రీకశలాటుకోత్కరఫలో న్నిద్రాటవిఁ జూచుచున్॥ (క) కలకంఠకంఠకందళ। కలహంసకకలభ ఖడ్గకారండమహా। కలవింకకంకకాసర। కలరవములకలకలంబుగలకాననమున్॥ (క) మల్లి మతల్లి సుమనో। వల్లీ వేల్లితకుడుంగవగోచరగభ్వ। ర్ఝిల్లీరవయుతపక్కణ। పల్లీవాచంయమేంద్ర భవ్యస్థలులన్॥ (వ) క నుంగొనుచు నేతేరముందట॥ (మ) కనియెన్ వ్యాసుఁడు వాగ్విలాసుఁ డుసమగ్రప్రీతి మందాకినిన్। ఘనపాఠీనఢులీలుఠత్కమఠనక్రాసీనినిన్ ని త్యఖే। లనదేవేంద్రపురాంగనాకుచతటాలంకారకర్పూరచం। దనలిం టాకినిఁ జక్రవాకిని విశుద్ధవ్యాయ నశ్లోకినిన్॥ (క) మందాకినీతటిన్యర। విందవికాసప్రసూనవిహరణమరుదా।నందరసకందళితక । మందిప్రభు రాజు సౌఖ్యమతి నేతెంచెన్॥ (వ) అట్లేగుదెంచి యమ్మందాకినీ జలం బులఁ గృతస్నానుండై కృష్ణద్వైపాయనుండు నిజశిష్యపరివృతుండై యే గుదెంచిన సనత్కుమారుండును బ్రత్యుత్థానంబుఁ జేసి యుచితాసనం బున నాసీనుంగావించి యర్ఘ్యపాద్యాదివిధులొనరించియతిథిసత్కా రంబులన్ బరితృప్తుంజేసి కొంతప్రొద్దు సముచితాలాపసుఖాంభోధి వీ చీ నిమగ్నసంతోషాయత్త చిత్తులై యుండనాగమనప్రయోజనం బ

—(*) {వ్యాసుండు సనత్కుమారునిఁబుణ్య క్షేత్రంబులఁ దెల్పుమని యడుగుట} (*)—

డిగినబ్రహ్మపుత్రుసకుఁ బరాశతనూభవుండిట్లనియె॥ (సీ) శ్రీవహించె నె చ్చోట బాలనక్షత్రేశశేఖరుండమరేంద్రసేవితుండు । సంధిల్లునెచ్చోట సార్వకాలంబును భూలోకమునఁగల్గు పుణ్యనదులు। దానతపఃకర్మఘ మకాంబులెచ్చోట విపులపుణ్యంబులావి -ంచుఁ । జరియింతురెచ్చోట సాన్నిధ్యులై హరి బ్రహ్మాదిదేవతాప్రముఖులెల్ల। ననఘమునులోకముల కె

పంబడిన వింధ్యాద్రిదర్పం బెంత గోవిందునిచేత ని స్తంభబడిన మందరం
బు సుందరం బెంత రావణాసురోత్పాటితం బైన కైలాసంబు విలాసం
బెంత భూధరధౌరేయతమాని కామాకంబైన మేరువు బరు వెంత
జలజాప్తమరీచికలకుం గాక యనలు హసించు హిమవత్పర్వతంబు గ
ర్వంబెంత నిర్ఝరంబైన గర్భంబున నావిర్భవించిన మిత్రతేజం బ
ణంగించు నస్తాచలంబు శస్తం బెంత చందనసందోహంబుఁ దక్కఁ
దక్కిన వృక్షంబుల నొల్లని మలయభూధరంబు మహత్త్వం బెంత రా
ఘవచాపంబునం బాసిన గంధమాదనంబు సాధనం బెంత సంతతభూ
భువనపారీణత నున్న గోత్రంబుల చరిత్రం బెంత యొక్కొక్క శైలం
బున కొక్కొక్క మహత్త్వంబు నెక్కొనుం గాక పెక్కు లన్నవేశ్కం
బు కామ్యార్థభోగమోక్షసుఖాభివృద్ధులు సిద్ధించు భుక్తిముక్తులతో
వ మోక్షంబుల చేవ తపసుల యెల్లి తీర్థంబుల వెల్లి యెల్లలకెల్ల
నైయెల్ల కార్యంబు లుల్లసిల్లు శ్రీనగేంద్రంబునకు సదృశంబు లగు నగం
బులు గలవె॥ (ఉ) గాయక భూరుహవ్రజమృగప్రకరోరగపక్షియూథము
ల్। గాయక భూధరంబులును గాయకగుల్మలతావితానముల్। గాయక
ఖడ్గకుంజరనికాయములుఙ్ విలసిల్లునిత్యము । న్నాయక శ్రీనగంబు ప
యిఁ బ్రస్ఫురణోద్ధతరంజనంబునఙ్॥(ఉ) ఖేచరభూమిభృత్ప్రచయకీరమృ
గోరగగుల్మసంఘముల్। ఖేచరజంబుకాదులు మృగీహరిగండకజంతుయూ
థముల్ । ఖేచరధారుణీజములు ఖేచరపుణ్యమృగవ్రజంబులుఙ్। ఖేచ
రరీతినెప్పుడును గ్రీడవహించును శ్రీనగంబునఙ్॥ ( గీ ) రూఢి యొ
ప్పార నెక్కు యేరూపమైన । దలఁపఁ దద్రూపముగఁ జేయుఁ దరు
చయంబు । స్థిరముగాఁగోర్కిసిద్ధింపఁజేయునట్టి । సిద్ధశిలలును వర్ధి
ల్లుశ్రీనగంబు ॥ ( సీ ) ఎన్ని కల్పాదుల నెందఱుపేంద్రులు నెన్ని
కల్పాదుల నెంద అజులు । ఎన్నికల్పాదుల నెందఱు దేవేంద్రు లె
న్నికల్పాదుల నెంద అమరు । లెన్నికల్పాదుల నెందఱు దైత్యు లె
న్నికల్పాదుల నెంద అనఘు । లెన్నికల్పాదుల నెందఱు మునినాథు,

తెన్నికల్పాదుల నెంద బార్యు । లన్ని యుగములయందును హ
రుఁ దదీయ । నామములయందుఁ బార్వతీనాథు నిలిపి । ప్రథిత
కామ్యార్థసిద్ధులు వడయు కతనఁ । బరమపావనలింగ శ్రీపర్వ
తుండు॥ (సీ) పాతాళగంగాప్రపాతపాతోత్తుంగకల్లోలఘుమఘుమా
ఘర్ఘరవము । ముక్తితాటంకినీముఖదర్పణోద్భాసి శిఖరాగ్రచకచక
శ్రీధరంబు । గదలిరసాతలగహ్వరాభ్రంకషస్థాలీశిలాసగద్గితకాంతి ।
శాతకుంభాగారచంచన్మణిచ్ఛటాస్థగితనూతనధామధళ్యరుచులుఁ । గలి
గి కమలాప్తచంద్రనక్షత్రతాళ । రసరసాయనబహుసుధారసనిపా
న । దివ్యసంజీవనికళాదీప్యమాన । బహుళ పుణ్యోన్నతంబు శ్రీప
ర్వతంబు॥ (క) తారాదులు జెరయఁదదా । కారంబులు పరుసవే
ది కనకముఁ జేయున్ । దారాధిపాంకు శ్రీగిరిఁ । జేరిన జీవులను బు
న్యాజీవులఁ జేయున్॥ (సీ) సంతతఫలితవృక్షశ్రేణి కాదత్తభిక్షాశనవ్ర
తబృందములును । ఛిన్నమూలలతాశిఖరాగ్రనవలీనోద్ధతపునస్సంధా
నతరువనంబుఁ । బాషాణగుహలనభ్రంకషగాత్రములౌ క్షణమాత్రఫ
లనమచ్చారుతరులు । దీపితస్పర్శవేధిశల్యకరణులు శ్రేష్ఠసంధానసంజీ
వకళలు । లింగవాహిని నివహంబు లింగగిరులు । భూతికుండవ్రజం
బు విభూతినదము । నద్భుతోపేతబహుపావనాశ్రమములుఁ । గలి
గి విలసిల్లు శ్రీగిరికంధరమున ॥ (ఉ) భానుఁడు పుట్టఁ బుట్టుచును భా
నునితోడను గూడి పీడుచున్ । భానుఁడు గ్రుంకఁ గ్రుంకుచును భాను
నితోడను గూడి నిత్యమున్ । బూనెడు భానుతాళవనభూరుహముల్
తవణిల్లునెంతయున్ । శ్రీనగభూమినూతనవిశేషముల న్గడు నద్భుతం
బులై ॥ (వ) ఇవ్విధంబునఁ జంద్రతాళంబులును రసరసాయనసిద్ధకళ
లును మృగదైత్యమృత్యువిషోరగమహాలాంఛనిసేనాగ్ని ఖడ్గపరవాద
కరోగప్రత్యర్థిపవిస్తంభకళలును బరకాయప్రవేశవిద్యౌషధంబులును
మొదలైన దృష్టసిద్ధవాంఛాపరులకు దృష్టసిద్ధులు సిద్ధించు వెండియు నప్ప
ర్వతేంద్రంబున మహాద్భుతపుణ్యవిశేషంబు లనంతంబులుం గలవనినవిని

వేదవ్యాసుండు తరువాతి కథావిధానం బెట్టిదని యడిగిన నమ్మునీం ద్రునకు సనత్కుమారుం డిట్లనియె॥

—(*) ఆశ్వాసాంతము. (*)—.

(క) తావకసేవకభిల్లక। దావికదళవరదభక్తతత్పరహరిష। బ్భావుకహిమకరవిచికిల। పావనజూటీ కుడుంగపర్వతలింగా॥ (శా)సాయంకాలనటత్తటిత్ప్రతినిధిచ్ఛాయాజటాస్వర్ధునీ। తోయాస్ఫాలనవిస్ఫురల్లహరికాతుంతుర్వసంఘర్షణా। స్ఫాయచ్చంద్రసుధోపజీవితవిరించశ్రీకరోటీముఖామ్నాయస్తోత్రకథాభటీభ్రమణసవ్యక్తాండచాడంబరా॥ (మాలిని)తరళమదనరూపా ధిక్కృతోద్యత్ప్రతాపా। సరసదివిజవర్యాస్థాపనాచార్యశౌర్యా।విరసదనుజనాశా విశ్వబృందారకేశా। నిరతధనదమిత్రా నిత్యకళ్యాణగాత్రా॥

గద్య॥ ఇదిశ్రీమల్లికార్జునకృపాలబ్ధ మేదురాష్ట్రభాషా

విశిష్ట శివయోగగుణవర్య శేషనాథార్యప్రణీతంబైన

పర్వతపురాణంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీమద్భ్రమరాంబాసహిత మల్లికార్జు

నార్పణమస్తు.

---



సంసారాది దివాపసర్గఫలవిస్తారాంబువర్షంబులున్ । శుంభచ్ఛాఖామహీరుహస్థిరస్ఫుటజ్యోతిస్తటిద్వల్లికా । రంభంబుల్ విలసిల్లు పర్వతమహాభూమిం బొల్చు ప్రభాప్రశస్తిమై॥ (క) ఎక్కడఁ జూచిన సురనదు । లెక్కడఁ జూచినను శంభుహేమగృహంబుల్ । ఎక్కడఁ జూచినఁ దీర్థము । లెక్కడ శ్రీనగము సాటియే వేఱగముల్॥ (వ) అట్టి పర్వతంబున॥ (సీ) భసితంబు భూమిభృత్ప్రాంతదేశంబునఁ దరుచైన రుద్రాక్షశతులు గడచి । ధవళితస్ఫటికాద్రితరువనస్థాయులై సల్లాపశైలముల్ సంతరించి । సల్లాపభూరుహచ్ఛాయ లుల్లంఘించి గాయకపర్వతోత్కరము దాటి । గాయకవృక్షగోపకంఠభూములు నిల్చి నాట్యాచలంబుల నటన సలిపి । నాట్యభూరుహగుల్మవానరఫణీంద్ర । బహులతానేకమృగసింహపక్షిసమితిఁ । జూచి క్రీడింపు చుందురు సుఖము లొంది । సాధకోత్తము లెపుడు శ్రీశైలమునను॥ (వ) అనిన విని సాత్త్వవతేయుం డిట్టి మహత్త్వంబు పర్వతునకుఁ గలుగు టెట్లనిన మహాదేవుండు పార్వతీదేవి కొనరిచ్చిన విధంబుఁ జెప్పెద నాకర్ణింపు మని సనత్కుమారుం డిట్లనియె॥ (సీ) సురధేనుగోష్ఠసంశుద్ధరోమాంధవప్రసిద్ధపావనకనచ్ఛ్రేణికలను । తత్తత్ప్రదేశవిస్తరసుధాదీర్ఘికాసోపాం

—(*) కైలాసంబున నీశ్వరుండు కొలువుదీరియుండుట. (*)—

తమాణిక్యసోపానములను । స్పర్శవేదిగ్రావబంధబంధురహర్మ్యభవనశోభితసాలభంజికలను । చారుచామీకరస్థాపిత నవరత్నకుట్టిమప్రాకారగోపురముల । నమరువిద్రుమభద్రరుద్రాక్షవృక్ష । పరిచితోన్నద్రికల్పద్రుభవనమధ్య । కిన్నరామరయువతిజేగీయమాన । లలితమహిమోన్నతంబు కైలాసనగము॥ (మ) అమరేంద్రాదివిశాలవైభవపరీహాసంబు సంజీవనీ । ద్రుమలీలావనకేళివాసము సురస్తోమాప్సరఃకిన్నరీ । ప్రమదాధ్యాసము దత్సుధారససరిద్భాసిప్రజాప్రిసావాసము । వృమచోల్లాసముఁ గల్పభూరుహమనోజ్ఞప్రస్సఁబుఁ గైలాసమున్॥ (మ) నిజవాసంబుగ నున్న విశ్వవిభుఁ డానిశ్వాసితామ్నాయుఁ డ । గ్గజరా

ట్ఫ్రమణాపటీకటీరుః డసద్భుహైహయోద్వ్యులఁ బ్రసాదించుఁ । డజ్ఞై సంతోషు రేం ద్రముఖ్యాదసుభృత్యాధీశసంసేవ్యుండై । అజగన్నిందవ్యయము పెట్టికొల్వు న మహాతేజంబుతో నున్నెడన్॥ (క) ఇంచుకగ్వాయు నడుకుల బ్ర । చండుండు భృంగియును హాస్యచతురతఁ జూపన్ । మెండుగ నచ్చర లేమలు । నిండు రసస్థితులతోడ నృత్యము సేయన్॥ (క) పటుగ తులఁబలుకు బాబా।పుటములఁ బాడుచును హాస్యపు టముచు దాటన్।జ టులగతిఁ గ్రిడసలుపుచు । నిటలాక్షునిఁ గొలుచు గణము నిటలము నందున్॥ (ఉ) సందీన కుంజబాజ్జకళ నిగ్గులు దేరఁగఁ బ్రాదిఘా నియున్ । దుండము ముందటన్ మెఱుపు నూలుహరిన సేసఁగు మోముదమ్మి । మెం డుగ నెలహారుపము మీఁదను రోయుదనంబుఁ జూపుచున్ । గొండుక నుంగు టల్లునికిఁ గుంజర వక్త్రుఁడు మ్రొక్కు సల్పగన్॥ (క) భద్రాశ్రిత భద్రవీరక। భద్రమహాకాళవిరభద్రాధిపుల్। భద్రాసనంబు డగ్గరి।భ ద్రాధిపుఁ గొల్తు రుభయపార్శ్వములందున్॥ (వ) ఒకవంకఁ గింకరు లుద్దండ వేదండ దైత్యజయాదిగీతములు పాడ।నొకచోటఁ గుంభసంభో దరకుంభజశ్రీసకుంభాదులు చేరిపొగడ। నొకవంక హరిపంకజోద్భవ ప్రాచీనబర్హిర్ముఖాదులు బలిసికొల్వ। నొకవంక నిశ్శంక యుక్తని రాతంక నిషఁగశంకాదులు నిండియుండ । నగ్రభాగంబునను వేత్రహ స్తుఁడగుచు। బలిసి నందీశ్వరుండు సురాభటులు మహాస్వర।బ్రమథు లి రువంకలను బరాబరులు సేయ।హరుండు పేరోలగంబున్న యవసరము న॥ (గీ) గిరిసుతకు మ్రొక్కి యెదురఁ గేంగేలు మొగిచి।విశ్వనాథున కిట్లని విన్నవించె। నరుణపల్లవపాణి నీలాళివేణి। సకలకల్యాణి శుకవా

—* శ్రీనగంబున శివుండు నివ్వకారణమును పార్వతి యడుగుట. *—

ణి శంభురాణి॥ (వ) దేవా యీసువనంబునందు శైలోత్తమశ్రేణు లు హిమవచ్ఛృంగంబును హేమకూటంబును నీలమేఘనిభంబైన నీలప ర్వతంబును రజతప్రభా భాసితంబైన శ్వేతశైలంబును శృంగత్రయం బునుం గలిగి సకలదేవభవనంబైన శృంగనగంబును జ్వలనప్రభంగల

కుంజరగిరియును బాలసూర్యప్రభం గల హేమాచలంబును భిన్నాంజనప్రభం గల గంధమాదనంబును మరకతప్రభాభాసురంబైన మాల్యవంతంబును సర్వరత్నమయంబై పద్మరాగనిభంబైన యుదయమహీధరంబును మలయభూధరంబును జంబూనదనిభంబైన తుషారధరంబును శంఖకుందేందునిభంబైన కైలాసశిఖరియును వర్ధమానగోత్రంబును రౌప్యధాతుయుక్తంబైన రౌప్యవంతంబును హరిచందనవర్ణంబైన హరినీలశిలోచ్చయంబును మృణాళసన్నిభంబైన వైరోచనాద్రియు రత్నప్రవాళభాసురంబైన శతపర్వతంబును కుంకుమవర్ణంబైన కింశుకధరిత్రీధరంబును స్ఫటికనిభంబైన విద్యుత్పర్వతంబును నీలోత్పలశ్యామంబైన పుష్పగిరియును మొదలైన సర్వసర్వంసహాసంరంభణ నానాద్భుతంబులం గల కుంభినీధరంబుల నెల్ల నతిక్రమించి శ్రీశైలం బశాంతక్రీడావినోదస్థానంబుఁ గావించుకొని యున్నవాఁడ విందుల మాహాత్మ్యం బెట్టిది యానతీయవలయు ననిన నమ్మహాదేవుం డమ్మహాదేవి కిట్లనియె॥

—(*) శిలాదమౌని తపంబు చేయుట. (*)—

(క) ఆదియుగాదుల కట మున్నాదిమతాపసవరేణ్యుఁ డైన శిలాదుం। డాదియుఁ దుదియును సరిగా। మోదంబునఁ దపము సలిపె మును లనుతింపన్॥(క)బృందారకు లరుదందఁగ। నిందుకిరణములను వాసరేంద్రప్రభలన్। డెందమునఁ గ్రోలి తాలిమి।గుందక వర్షములు మూఁడుకోటులు సలిపెన్॥(వ)మఱియును॥(క)శతకోటివత్సరంబులు। ప్రతిదినమొ కొంత శిలయె భక్షించి సదా।గతి తత్త్వయోగవశమునఁ జతురుండై నిలిచె మౌని సంఘము పొగడన్॥(చ)పరులను నార్వురం గుదియఁ బట్టి జయించి పదద్వయంబునన్।మరిగిచరించునట్టి పవమానము జోఁకకుఁ దెచ్చి వానిచేఁ।దిరముగఁ బాపయింతిని విధేయవశంబున మేలుకొల్పియా।వరుసన వచ్చి నెన్నడిమి వాఁకిలిఁ గాంచియు నందు వాఁకిటన్॥

(గీ) పవనుఁ గుంభించి మఱియు నప్పవనగమనస। మహిమమునఁ జేసి యో
గాగ్ని మండఁజేసి। దివిఁటి ముట్టింప వారసి దీపమైనఁ। గరిమ మోవఁగ
లోని చీఁకటియు మాన్చె॥ (చ) ఒదకము గాఁగ నెన్నఁడివి యీ గ్రహలు మా
నిపి శంభు మూర్తికిఁ। విడిదళకై దళ్వయ నవీన పయోజము నిల్పి యం
దుపై। పృథుఁ గని సౌఖ్యమంది మది మించిన పశ్చిమనాడిచేత నైవెడఁ
గరగించెఁ జిద్గగనవాటికయందుఁ బ్రమోదచంద్రునిఁ॥ (క) కరఁగించె
నమృతధారలు। తొరఁగించె సుధానుభావతుష్టి యెలపగఁ। బెరిగించెను
సంతోషము। మరగించెను శంభుఁ దనదు మానసవృద్ధిఁ॥ (వ) మఱియు బ్ర
హ్మాండంబులం గల చిహ్నంబు లన్నియుం దన దేహంబునం గనుంగొను
చు భూజలాగ్నివాయువ్యోమభూతంబులను బర్వత సాగరద్వీపనదీయు
తనువన గ్రహనక్షత్రంబులను నాత్మభవనంబునందుఁ గానంబడ సవ్య
భాగంబున నిడానాడి చంద్రుండు షోడశకళాసహితుండై యుండు
దక్షిణభాగంబునఁ బింగళనాడి సూర్యుండు ద్వాదశకళాసహితుం
డై యుండు సూర్యేందువర్తనంబులం గాలంబు వర్తించు నందు పరి
భాగంబున ననలతత్త్వంబును నధోభాగంబున జలతత్త్వంబును మఱియు న
రువది నిశ్వాసంబు లొక్క గడియయందునొక్కొక్క వేళ సూర్యుం
డును జంద్రుండును వర్తించు నైదు గడియలు గూడ లక్షంబని పం
డ్రెండు నొక్క దివసం బంచులకు నిరువదియొక్క వేయిన్నార్వాలు
స్వాసంబు లంటి దినపక్షమాసఋతువులు నడచు దినవారనక్షత్రయోగ
కరణగ్రహప్రయోగ కాలచక్ర స్వరచక్రంబు లనేకప్రకారంబులఁ జం
ద్రసూర్యపక్షంబులు చంద్రసూర్యపథంబును జంద్రసూర్యయామంబులు
చంద్రసూర్యఘటికలు చంద్రసూర్యగ్రహంబులై నాడికామార్గంబులు
వర్తిల్లు నందు విశ్వాసనిశ్వాసంబుల వలన హానివృద్ధులు లాభాలాభం
బులు మానావమానంబులు హృదయపద్మోపకంఠదీప్తాష్టదళజీవహంస
సంధానఫలంబులు నాత్మదర్శనం బందఁ గాంచుచుండు॥ (ఉ) ఆచపలేత
రాక్షుఁ డమృతానుభవంబునఁ దృష్టిఁ బొందె దితా। లో జెవిలోని చూ

పులును లోని విరక్తిగుణు లోని చింతయుఁగా౹ లోచని తత్త్వసౌఖ్యనిధిలో
నఁ జరింపుచు బాహ్యచేష్టలన్౹ జూచి పరిత్యజించును త్రిశూలిఁ దలంచి
జపంబుసేయుచున్॥ (క) సంఖ్యాక్షరిజపియింప సమంచితపరవశత న
క్షమాలిక చేనొ౹ కీలించుక యుంగరపడని శ్చంచలుఁడై కన్ను మోడ్చి
సంయమి యుండెన్॥ (సీ) అందంద నిద్రించు నద్రి చందంబున నన్న
పానాదులు నప్పురమున౹ నింపార వతిఁరాంప నెన్నడు త్రోవయుండుం
డి చిణీశబ్ద ముద్భవించె౹ చిణిచిణి యని మ్రోయుఁ జెలఁగి శంఖాంభో
ధి తంత్రికానాదమర్దళ నినాద౹ భేరినిస్స్వానసంభృత వేణుతాళాది
ఘంటానినాదమేఘస్వనములు౹ మెఱసి దశవిధముల మ్రోయంగ నా
క్రిందఁ దొమ్మిదింటి మాని తొలఁగైన౹ నాద ముల్లసిల్ల నాదప్రియుం
డగు నాగధరున కర్పణంబు చేసి॥ (క) ఈవిధమునఁ జరియింపఁగ౹
నావిభునకు మనసు లీన మయ్యెను నయినన్౹ లేవయ్యెను కర్మము
లటు౹ గావున సంకల్పమును వికల్పము నుడిగెన్॥ (వ) ఇట్లు మహాదే
వుని గూర్చి భక్తి నిష్ఠాగరిష్ఠుండై తపంబు సేయుచున్నంత॥

—(*) శిలాదునకు నీశ్వరుండు ప్రత్యక్షంబగుట. (*)—

(సీ) మొలకచుక్కలరాజు మొల్లపువ్వును బోలె మించిన మౌళిఁ గీలిం
చినాఁడు౹ పొడల కెంజాయలఁ బులిరక్కసునితోలుఁ గటిమీఁదదిండుగాఁ
గట్టినాఁడు౹ విశదరత్నప్రభల్ వెదచల్లు శేషాహి గొడుగుపావాలుగాఁ
దొడిగినాఁడు౹ వడఁకుగుబ్బలిరాచవారికన్నెను మేన నచ్చినగతినుండ ని
చ్చినాఁడు౹ కలికిచూపులఁ బచ్చవిలుకానిఁజూచి౹ భూతినెరపూఁతగా
మేనఁబూసినాఁడు౹ అట్టిదేవుండు సకలకళ్యాణమూర్తి౹ యాశిలాదు
నియెదురఁ బ్రత్యక్షమయ్యె॥ వచనము॥ ఇట్లు జగదారాధ్యుండైన యీ
శ్వరుండు ప్రత్యక్షంబైన నమ్మునీశ్వరుండు సాష్టాంగదండప్రణామంబు
చేసి పులకచయకంచుకితశరీరుండును నానందకందళిత హృదయారవిం
దుండును ముకుళితకరకమలుండును నగుచు నిట్లని స్తుతియించె॥ దండక

మ॥ శ్రీమేరుకైలాససింహాసనాధీశ నాకేశముఖ్యామరస్తోమమస్తస్థలీ
హేమకోటీరవిస్ఫార మాణిక్యరింఛోళిపాళీ మయూఖాగ్ర కింజల్కిత
శ్రీపదాంభోజ సత్కీర్తికర్పూర సంవాసితాంభోజ గర్భాండభాండా
మహోద్దండశుండాలదైతేయఖేలాతమఃఖండమార్తాండ దోర్దండ
హేమాద్రికోదండ చండేశ్వరస్తుత్య నిత్యానిరాతంకనిశ్శంక నిర్ద్వంద్వ
నిస్సంగనిర్లేప నిర్మాయికా నిష్కళంకానిరీహానిరాకారసాకారపా
దాంబుజాలంకృతాశీవృషాధీశ రాజత్తులాకోటి రత్నావళీ క్షుద్రఘం
టాధ్వనిధ్వానితక్ష్మాధర శ్రేణికాకందరా సుందరావాస లావణ్యరేఖా
కళాదభ్రిరుద్రాంగనాబాహువల్లీమతల్లీ పరిష్కార దేదీప్యమానేంద్ర
రత్నావళీధాళధ్వన్యక్వణచ్చామరోద్ధూత వాతప్రచారాలకాశోభ
నాకారకంజాత సంజాతకోటీకరోటీ సదాకల్పజూటాటవీ చంద్రచం
ద్రాతపాస్ఫార నానందఖేలాదిరాజచ్చకోరా మహోదారదంభేతర
జ్ఞానసంభృత్సమాధాన విశ్వంభరాంభోజ సంభూతజంభాసురారాతి
కుంభీనసాధీశ కుంభోధరాగస్త్యకుంభీంద్రవక్త్రాది విస్రంభభక్తక్రియా
రంభసంసేవ్య హాలాహలాభీలకీలాపరీహాసలాలా సురాటోపఖేలావిశా
లత్రిశూలాయుధజ్వాలజాలామహాకాళపశ్యల్లలాటా వియత్సింధుజూ
టాంకకళాజూటపాటీర కల్పద్రుమాహార్యహశ్రీకవాటీ ధరిత్రీసమాటీ కన
స్పర్శధూటీమహాకల్పఘూటీ కరాంభోజ విన్యాసవృత్తానునాదాసదా
మోదఅభ్రాపగాహీర శుభ్రాంబుజక్షీర భిభ్రితకళాశారదభ్రాభ్రి
మూరాడదభ్రోరగాదీశ విభ్రాజమానేందుమందారబృందారకాధార
నీహారకాసారకీర్తికృపామూర్తి భిల్లాంగనాబిల్వవల్లీ దళప్రేమభిల్లాసు
రస్వాంతపల్లాసురేంద్రాది వల్లీజయోల్లాసమల్లీ ప్రసూనాంగవల్లీ స
దారాధ్యసల్లీలభక్తాత్మ హల్లీసకాయోగిహృల్లీనసంబంధ దంతావళీ
త్వక్పటీత్రాకుబేరాస్యమిత్రా సమాఖ్యాచరిత్రాలలాటాగ్నినేత్రా మ
హాగ్ర్యాకళత్రా పవిత్రాంగదేవాగణవ్రాతగీర్వాణభూజా నుతశ్రీవిరా
జాజగద్దీప్తతేజా జితశ్రీతనూజా కృపాపారవారా శుభవ్యాళహారా

సమస్తోపచారా సమగ్రోపహారా సముద్యద్విహారా శుభాకార అక్షీణ కారుణ్యవీక్షా సురద్విడ్విపక్షా సదాభక్తపక్షా జగజ్జాలరక్షాకళాస్పష్టద

(శిలాదుండు భవుని మెప్పించి పర్వతనం
దీశ్వరులం బుత్రులంగాం బడయుట.)

క్షా తమఃపాశమోక్షా మరుత్కల్పవృక్షా విరూపాక్ష ఈశా శివవ్యోమకేశా తమద్దేవ వేశా మహాంహఃప్రణాశా విశాలప్రకాశా నగేంద్రాత్మజేశా మహేశా గిరీశా నమస్తే నమస్తే నమస్తే నమః॥ (వ) అని స్తుతియించి యిట్లని విన్నవించె॥ (క) కులదీపకుండుదయించినఁ। గులమునకు యశంబు దెచ్చు గోత్రము మనుపున్। గులనాశకుఁడుదయించినఁ। గులమునకపకీర్తి దెచ్చుఁ గుజనులు వొగడన్॥ (క) నీపాదభక్తియుక్తుల। నోపరమేశ్వర కృపాబ్ధి నొసఁగుము సుతులన్। నీపాదభక్తియందును। ఏపాటిగొ అంతమైన నేవరమొల్లన్॥ (వ) ఇట్లు కులదీపకులు శివధర్మపరాయణులునైన కొడుకులఁ గరుణింపుమని వరంబు వేఁడిన నమ్మహాదేవుండును దనధర్మాంశంబునఁ బర్వతనందీశ్వరులను బుత్రుల నయోనిసంభవులంగా ననుగ్రహించి యంతర్ధానంబు సేయ నమ్మునీంద్రుండును దనధర్మపత్ని చేతికి నక్కుమారుల నిచ్చి సంతోషామృతాంబుధి నోలలాడుచు ననుదినప్రవర్ధమానాంగులుగాఁ బోషింపుచుండిరంత॥ (క) శివధర్మవర్తనంబుల। శివయోగధ్యానభక్తిఁ జేతఃప్రీతిన్। శివమంత్రపఠనరతు

(నందీశ్వరుండు హరునిఁ గూర్చి తపంబు చేయుట.)

లను। శివుఁ బూజింపుదురు మానిశిశువులు వేడ్కన్॥ (క) అంతట నందీశ్వరుఁడుని। రంతరసద్భావనాంతరంగస్థితిచు। ద్ధాంతఃకరుణుండై శివు। మంతనమునఁ దపము చేసె మానులు వొగడన్॥ (క) అష్టాంగయోగభక్తివి। శిష్టాచారప్రసిద్ధసిద్ధాంతకథో। ద్దిష్టజ్ఞానామృతసం। తుష్టిప్రమదంబుఁ బొందె ధూర్జటిఁ బొగడెన్॥ (క) నిరుపమనిత్యనిరంజన। నిరవద్యవాదిస్వరూప నిత్యానందా। నిరుపాధితత్త్వనిర్మల। నిరవధి నిర్లేపరూపా

పనిఖిలాధీశా॥ (శా) సాధ్యుండై నను సేవింప వచ్చినమగుఁడున్ సాధింపక
త్యంతముఁ గా। మదస్తంభగుణప్రవృత్తి చేతనలెరిగి నేఁడాంగుడ నెన్నెరియో। గి
ర్వ్యేయము ప్రతిభాకటాక్షమునఁ గన్ గిర్వాణులున్ సిద్ధులు సిద్ధ్యాదుల్ ధన
దున్నతుల్ పొగడ ప్రాపించి శ్రీగిరినాథశైల॥ (చ) అహాహామున్
బికంబులును చలిఁ గొల్చి గనిచ్చినా చూడ। తహాతహాడింగ నెంచుకొని దా
యఁగ బాణముఁ గూర్చికొంచు లక్। కహాకహా నాదనుల్ చెలఁగఁ గ్రన్ననచే
సియునంగుఁడ వొబ్బో। అహాహా భవస్ఫురితాపము లణఁగ్పులఁ జేసి దాలి
యంగ శక్యమే॥ (ఉ) దేవభవప్పాదాబ్జయుగ దీపితభక్తి సుకోరియై వెంచ
మున్ వారిఁ గోర్కెలు నొసఁగు వాక్కోలు బ్రిన్నటి యక్షయసంపద। స్థావని
రోధియుచుంటఁ బల్తోషము నొందెను సిద్ధవాంఛనన్। ఘాపము నిం
డ నీదు పదభక్తియె నాకు ననుగ్రహింపవే॥ (ఉ) పంకజగర్భవంద్య
శివ భక్తగణప్రియ విన్నపంబు నా। వంకఁ గృపాసుధాదృష్టి పరివ
ర్తిఁ తత్తుష్టి యొనర్పఁ బన్నసి। వింక గణాళిలోన నొక కింకరుఁగా
దయఁ బ్రోవు మయ్యని। శ్శంక శశాంక కింకరవశంకర శంకర శాం
కరీప్రియా॥ (క) చతురంతరయోగములన్। బహురామ్నాయాగమోక్త
సన్నుతులందున్। జతురాననవంద్యుని నతి చతురప్రియులందుఁ గొలు
చు జనులు నుతింపన్॥ (క) పంచముఖజాతిరములఁ। బంచప్రణవముల
మూల పంచాక్షరిచేఁ। బంచబ్రహ్మములందును। బంచస్తవములను బూ
న్చుఁ బంచశరారిన్॥ (క) షడ్విధభక్తిస్థితి నరి। షడ్వర్గంబులను గె
లిచి షట్స్థలవిదుఁడై। షడ్విధములైన యాధ్వలు। షడ్విధపద్మముల
దాఁటి శంభునిఁ గాంచున్॥ (క) సప్తద్వీపలోకాధిపు। సప్తాశ్వహి
మాంశనేత్రసారసుజలభూ। సప్తార్చిముఖ ఖమూర్తిని। సప్తముఖా
ధీశసఖుని శంభునిఁ దలఁచున్॥ (క) అష్టాంగభక్తిరతుఁడై। యష్టవిధార్చ
నములందు నతిశీలుండై। యష్టద్వయోపచారము। లష్టతనుప్రభున కొసఁ
గు నవవిధభక్తిన్॥ మఱియును॥ (ఉ) అంధకగంధసింధురమదాంధజలంధ
రదానవచ్ఛటా। బంధధురంధర ప్రమథబాంధవ పంకజబంధువంద్యసా।

గంధికగంధిసహాయుత కంధినిషంగ కబంధజారిసంబంధకిరీటిభక్తజన
బంధుర శ్రీగిరికంధరాలయా॥ (శా) గంగాతోయరుహాగతభ్రమరికల్
కణోత్పలామోదసంసంగప్రేమ వహింప నభ్రతటినీ చంద్రానినా
ఘూటికారంగోపక్రమకంకణమంతనక ధారంభంబు లంచల్గినన్ । శృం
గారాంగి భవాని వేఁడు తగవుల్ చింతింతు గౌరీశ్వరా॥ అని మఱియును॥
(సీ) తరుణేందుధరుబృహదారణ్యకబహ్వాంసోపనిషద్వచస్తుతులఁ ద
లఁచు । సన్నుతించును శివసంకల్పసూక్తుల శ్రీరుద్రసూక్తుల శివుని మహి
మ। రతిపతిధ్వంసు నారాయణబ్రహ్మోపనిషదుక్తులను నహర్నిశముఁ
బొగడుఁ। గైవల్యజాబాలకాలాగ్నిరుద్రోపనిషదర్థముల నీశుని యఱిఁద
లఁచు। వేదపాద స్తవంబుల విశ్వనాథు । సన్నుతించుచు సేవించు సంభ్ర
మమున। నచలితంబును దుష్కరమైన తపము । సలుప ప్రత్యక్షమై నిల్చె
శంభుఁడంత॥ (సీ) సిగ్గులు ఖండించుఁ జిగురుకైదువసాము రట్టడికానిఁ
బోఁదట్టినాఁడు । వడిగలత్తఱిమించ వారువంబులరౌతు బండిరొప్పి
డుపనిఁ బంచినాఁడు। కడలిరాయని నిగల యల్లుఁదిలకంబు వింటికినమ్ము
గావించినాఁడు । రంతుగావిహరించు రాకాసిపల్లెలు నవఖళంబుగఁ
జల్లులాడినాఁడు । జనులకిష్టార్థకాములు వెదచల్లినాఁడు । కంఠకో
ణంబు విషమసికాళిమంబు। మెఱపుకస్తూరికారేఖ యొఱపువాఁడు। అభ

—(*) ప్రత్యక్షంబైనయీశ్వరుని నందీశ్వరుండు స్తుతించుట. (*)—

వుఁడనుకంప మెచ్చి ప్రత్యక్షమయ్యె॥ అంత॥ (క) ప్రమదాశ్రుబిందు
వులు ముఖ । కమలంబున దొప్పఁదొఁగఁగా నందీశం । డమరగణపరివృ
తుండగు। శమనారాతికిని జకరెఁజాఁగిలి మ్రొక్కెన్॥ (గీ) అట్లు ప్రణ
మిల్లి మఱియు సాష్టాంగమెఱఁగి । నిలచి కెంగేలుఁ గీలించి నిటలమునను।
సుఖమునొందుచుఁ బులకకంచుకిత దేహుఁ। డగుచుఁ బరమేశునిట్లని యభి
నుతించె॥ నిరోష్ఠ్యగద్య॥ జయ జయ సకలకల్యాణరత్నరత్నాకరా। సక
లనిర్జరనికరశరణ్యా। శ్రీశైలహాటకాచలకైలాస కంధరసదనసంతత

సంచారా. జలజాసన సహస్రాక్ష ధనంజయ దండధర నిశాట సదాగ
తి ధనదాది నిఖిల నిర్జర శిరఃకిరీట రత్న చకచక చాంచల్య స్థగితచ
రణసరసిజా । కీర్తిఘనసార గంధిత నిఖిలాజాండ కరండా । య
ఖండిత శరదండ శైలకాండాసనా । ఖండశశాంక శేఖరా। అండజనా
యకాలంకారితగండస్థలా। కనకకంకణఝుణఝుణా తాండవనటనటచ్చం
చరీకాంగనాహస్త పల్లవాలింగితశరీర। దరహాసచంద్రికాసాధిత। స
కలకల్యాణసంచయసంచితా। నిఖిలఖచరకిన్నరనిర్జరాధినాయకా। శ్రీ
శైలనాయకా। సనకసనందనాదిసంయమీంద్రస్వచ్ఛచిత్తసరసిజకర్ణికా
స్థానకనకాసనాసీన। నీలజలదచంచరీకా। శక్రరత్న రాజరాజితహాలా
హలకంధరా। నిర్జితజలంధరా। కటిస్థానసన్నద్ధానంతకాంచీరత్నకింకిణీ
నాదనాదిత। నిఖిలాచలకంధరాంతరాళ। సంధ్యాకాండనటనాట్యా
లంకార। లాలితరత్నకటకఘటితచరణతాళనదళిత। ధరాతలనిటలతటక
టాక్షేక్షణక్షణికనగరదైతేయ । అక్షీణనక్షత్రరాజగ్రహరాజనయ
న। అక్షరాక్షయాద్రీంద్రకన్యకాదత్తదక్షిణేతరదేహ । ఘటికాచలనాజ
స్రసహస్రనిస్వాన । శంఖకాహళకాహళీఝర్ఝుఝర్ఝరఝల్లరీ ఝురాఝూనక
ఘుఘుంరికాఘంటఘణఘణనాదనినదిత । నిఖిలధారాధరకంధరదశశత
కిరణనిచయదళిత। నిశితజలజశిశిరఖరకరసంకాశ । క్షారాలంకారితక
ల్యాణశరీర। నిజచరణాగ్రకరఘట్టఘట్టితకరినాంధకాదినిఖిలరాక్షసశిర
స్సరసిజనికాయ। సకలజగద్రక్షా। కారణదయాకటాక్ష । శతసహ
స్రలక్షణానంతసంఖ్యాతజలజసంజాతాండశ్రేణికారత్నఖచిత కరశా
ఖాంకిత। హారాంగదకాంచీకటకాలంకారితకంధరా। శ్రీచరణసారస
నిశ్చయజ్ఞాననిరతిశయధ్యానధారణనిశ్చలితాంతఃకరణ । కణ్వకణాద
నారదధాత్రీగర్గాగస్త్యచిత్రఖండశిలాదాదిసంయమీంద్రచిత్తాంతరా
రాధనసక్రియారాధ్యచింతితార్థసంతత దానచింతారత్న । త్రిదశ
గంగాతరంగిణీలహరికాసలిలసంక్షాళిత కనత్కనకకటిల్లతాచ్ఛాయా
చ్ఛన్నజటాజూటాగ్రదిగ్గ్రథితచంద్రరేఖాగళత్రిదశాసన రసాసారధా

గారక్షిత । హరస్థితసరసిజాసనశిరఃకథితహరలీలాకథానంతకందళిత చిత్తసరసిజనిశ్శంకనిషుఃశంకనియుతనిశ్శ్రేయసస్థానాగ్రిసహోజాండహర శైలహరధరిత్రీగగనతాళ। లింగాత్మసహస్రాక్షదశాననగజాననగజక ర్ణశంఖకర్ణగోకర్ణాదిసనాతనగణాళిసదారాధనక్రియాధ్యేయనిజా నన చంద్రచంద్రికారాజిత గిరిరాజకన్యకానయన। హల్లకనిజదేహజ లధిజనితజగజ్జాలతరంగ శ్రీశైలలింగ నతి స్తే నతి స్తే నతిః॥(వ)అని యి ట్లు వినుతించి పునఃపునఃప్రణామంబు చేసి యిట్లని విన్నవించె॥

—(*)శివుండు నందీశ్వరుని వాహనంబుగాఁ గొనుట (*)—

(క) ఆపద్మజాండబుద్బుద। రూపములు జనించు నీదు రూపాంబు ధిఁ బ।మూర్తిఁబును ధరియింపఁగ। నోపిన సత్వంబు నాకు నొసఁగఁ గ వలయుణ్॥(క)నాదేహము నిత్యంబును నీజే మఁగదని చెరసి నిను భరియింపణ్। నీదివ్యవాహనముగా। నోదేవా ధీశ వరము నొసఁగుము నాకుణ్॥(వ)అని విన్నవించిన నానందీశ్వరునకు సర్వజ్ఞత్వంబును బ్రమ థగణాధిపత్యంబును నిజవాహనత్వంబును ననుగ్రహించిన నది కారణం బుగా నమ్మహాదేవుండు నందివాహనారూఢుం డయ్యె నందీశ్వరుండు తపంబు సేయు పుణ్యమహత్త్వంబున నంది మండలం బనంగ నతిపవిత్ర స్థానంబై వెలసె నందు వర్తించు సమస్తజంతువులకు భోగమోక్షసౌ ఖ్యంబులుసిద్ధించు వెండియు॥(క)శ్రీపర్వతమాహాత్మ్యము। భూపావన

—(*)పర్వతుం డత్యుగ్రతపంబు సల్పుట.(*)—

మఖిలలోకపూజ్యంబు మహా। పాపప్రణాశనము విను। మా పుణ్యుఁ డు తపము చేసె నతులితభక్తిణ్॥(సీసము)జగతి నజాదిమేషవ్రాతములు గొన్ని పర్ణభక్షణమున బ్రతుకుఁ గాదె।అవనిపైఁ బారావతాదిపక్షు లు శిలావితతి భక్షించి జీవింపఁ గాదె।సకలపన్నగపురస్సరజంతువులు గొన్ని తెమ్మెరల్ గ్రోలి వర్ధిల్లుఁ గాదె।సలిలసంచరమీనసస్యాదులకు నెల్లఁ దోయంబు వలన సంతుష్టి గాదె।యనుచుఁ బర్ణోపలానిలాహా రవృత్తి। మెఱఁగు మౌనుల తపములు మెచ్చ కిట్లు। ధాత్రిపై నిరాహా

రుఁడై తపము సలిపెఁ బవనాశనుండు విదళితాఘ పవనాశనుండై ॥(క) సలి
పెఁ దపముష్ణకాలము। పలుకక దొడరంగ నోరు పటపటఁ బగులన్।
దలఁచిన డెందము గలఁగఁగఁ। జలియింపక తపము సలిపె సాహసవృ
త్తిన్॥ (మ) ధరణిన్ మూర్ధ్నము మోపి మీఁదికిని బాదద్వంద్వమున్
జాపి భా। స్కరువీక్షింపుచు వహ్నిమధ్యమున నేకస్వాంతసంయుక్తుఁ
డై। కరచర్మాంబర కామఘస్మర శివా గంగాతరంగావళీ।పరివేదిప్రౌ
విశాల మౌళియనుచున్ భావించు డెందంబునన్॥(క) పగలును రేలును
నుడుగక। భగభగహుతభుకరణములు భాంకృతులు నభః ఖగగతుల నె
గయ మాఁచులు। పొగడన్ బంచాగ్నిమధ్యభూమిఁ జరించెన్॥(మ) వలి
కాలంబున నేటి నట్టనడుమన్ వాశ్చార భేకీధుని। బలవత్తుంగతరంగసం
ఘవిలుఠద్వంశిస్థ వేణీచ్ఛటల్। దళుకొత్తన్ ధరణీధరేశసుమనోధన్యా
త్మవిధ్వంసకున్। గలధౌతాద్రినుధారున్ గంధర్వున్ గామించు డెం
దంబునన్। (క) ప్రమథులు సనకసనందులు। నమరులుఁ గడుఁ జోద్యమ
నుచు నచ్చెరువొందన్। బ్రమదమున నిలిచి తపములు। కొమరుం బ్రా
యమున వర్షకోటులు సలిపెన్॥(శా) దుర్లైన్ దారలు చంద్రభాస్కరు
లుబట్టుత్రాడఁగా బ్రహ్మభీతిల్లెన్ దిక్కరులెల్ల మ్రొగ్గ దివిజాధీశుల్ ద
లంకింగని। ట్లగ్గాడెన్ ధరతల్లడిల్లెహరి బ్రహ్మాండంబు కంపింపశోభిల్లెన్
శంకరుఁడాదిదేవుఁడు కృపాభీష్టప్రపన్నాంతుఁడై॥(సీ) ముడిచినాఁడే వే
ల్పు మున్నీటినడువీధి శృంగారపుఁదోఁట చిన్నిపువ్వుఁ। గట్టినాఁడే వేల్పు
కటిమీఁదదిండుగా పదితెలుంగులవన్నె పచ్చడంబు। అలఁదినాఁడే వేలు
పంగరాగము వేనఁ గలిగివాసన దశగతులవలువఁ। గై సేయునే వేల్పు క
మ్మతెమ్మెరలపుల్కడిగిన మాణిక్యకంకణములు। సకలలోకంబులును జే
యఁజాలుసొబగు। మించిమెఱయునే దేవుని మేనితొడవు। అట్టిదేవుండు
కరుణాసుధాంబురాశి। యచలవల్లభు నెదురఁ బ్రత్యక్షమయ్యె॥ (వ) ఇ
ట్లుప్రత్యక్షమై శిలాదపుత్రునిఁ గరుణాసుధార్ద్రదృష్టి వీక్షించి వరంబు
వేఁడుమనిన నమ్మునీంద్రుండు॥ (సీ) శివపదాంభోజ స్వచిత్తాబ్జముల

యందుఁ గోరెపుఁ దుమ్మెద పింఛముగూడియాడ। నవకమ్మైసిలిచి యానం
దాంకురంబులు పొడమ్మకై వడిమేనఁ బులకలమర । నానందజలధార
లాణిముత్యంబుల హారావళి రేవల ననుకరింప। గద్గదస్వరయుక్తకంఠంబు
శోభిల్లఁ దద్గతచిత్తుఁడై తత్క్షణమున। నిట్లుహృదయంబులోనున్న యీశ్వ
రుండు। ఎదుటఁబ్రత్యక్షమైన మునీంద్రసుతుండు। పుడమి సర్వాంగకం
బుగఁబొందమ్రొక్కి। కీర్తనముచేయఁ దొడఁగెఁగెంగేలు మొగిచి॥
విశ్వదండకము॥ శ్రీశైలసామ్రాజ్యసింహాసనాసీన శ్రీమన్మహాదేవ సర్వ
జ్ఞ సర్వేశ సర్వామరాధీశ సమ్యక్స్వరబ్రహ్మరూపా విరూపాక్ష దేవాస్వ
కీయాస్వచంద్రప్రభాభాసమానాద్రిపుత్రీ విలోలాక్షికల్హారసంభావితా
నేకవిస్రంభపూజావిధారంభ విశ్వంభరాంభోజ గర్భాదికుంభోద్భవ

—(*) సాక్షాత్కరించిన శంభునిఁ బర్వతుండు స్తుతించుట. (*)—

శ్రీగణవ్రాత శ్రీపార్వతీ దేహవల్లీమతల్లీ సమావేల్లితస్వచ్ఛమందర
బృందారకాధార వేదాంగనాచారుహస్తద్వయా హేమకేయూరమా
ణిక్యరాజత్క్వణచ్చామరోద్ధూతవాతస్ఫురత్కుంతలా కంతుసంహారచం
డీశ్వరస్తూయమానా స్వసామర్థ్యబాహాబలాలామమానాభ్రవర్ణా
త్రికణాదిగోకర్ణపంచాక్షలింగాక్షసానందసద్భక్తసంఘాత భృంగీశ
నాట్యక్రియానంద నందీశహస్తాంబుజోపేతవేత్రాగ్రసంవారితానేకగీ
ర్వాణసందోహ హాలాహలోల్లాస కైలాసశృంగస్థలీవాస నాకమర్త
వాక్కాయసంభూతసర్వాపరాధంబులం గాచి రక్షింపవే దేవనీ నిర్మ
డల్ పుణ్యతీర్థావళి నికృత్రిమంబుల్ సమస్తామరశ్రేణి నీచారునిశ్వాసము
ల్ వేదముల్ నీదు లీలావినోదంబు లీలోకజాలంబు నీదేహవారాశిలో
లోకవీచీకదంబంబు లావిర్భవింపంగ నప్ప ద్మజాండంబు లోనున్న బ్ర
హ్మాదులా నీమహత్వంబు వర్ణింపఁగా నేర్తురే దేవ నీభ్రూలతాచా
రువిక్షేపమాత్రంబునన్ బ్రహ్మజాండంబు లెల్లన్ సముద్భూతరక్షోన్న
తిం. జేయు నీవర్థి నూహించు కార్యంబు లెన్నంగ శక్యంబె యీస్వ

న్మహాత్మ్యంబుఁ గానంగ బ్రహ్మాదులు న్నేరరన్నఁ మనుష్యాదు లెబ్భం గుల న్నేర్తురే దేవయాగంబులుఁ జ్ఞానయోగంబులుఁ గర్మయో గంబులుం గోటిలక్షాదులుఁ భక్తికిఁ సాటిగా లేవు నీభక్తికిఁ గూర్తు నీభక్తికి న్నిల్తు నీభక్తియోగంబు నీమెచ్చు నీభక్తి నాకుం బ్రసాదించి రక్షించు నాతల్లి నాతండ్రి నాదాత నాయిష్టదైవంబు నాదేహసంర క్షు నాయిమ్ము నాసొమ్ము నాపట్టుఁగొమ్మ్మఁ మహాదేవ నీవేదలఁ బ్రోవవే యంచుభావింతు సేవింతు దేవా నమస్తే జగద్భ్యాతహేతో నమస్తే దయాంభోధిసేతో నమస్తే దయాబ్ధే నమ స్సోమసల్లబ్ధే నమ శ్చం ద్రవేణే నమ శ్శూలపాణే నమో నందికేతో నమః పుణ్యహేతో నమో నిత్యశక్తేనమ స్సర్వకర్త్రే నమో మంజుకాంతే నమ స్తత్వశాంతే నమో నంతభూతే నమః పూతగీతేనమో ధర్మయుక్తే నమ స్సూనృతోక్తే నమో విశ్వస్రష్టే నమో దివ్యదృష్టే నమోభక్తబంధో నమః పుణ్యసిం ధో నమో భవ్యమూర్తేః నమ శ్శుభ్రకీర్తేః నమః పుణ్యవర్తేః నమః పార్వతీశా నమ శ్శ్రీగిరీశా నమస్తేనమస్తే నమస్తేనమః॥ అని స్తుతియిం చి యిట్లనియె॥(శా) క్షీరాంభోధితరంగరింగితపరిక్రీడాకశాగభర్గవి। స్తారోల్లాసిమరాళ మాచవిటిగుంతఁ జేరఁగాఁ గోరు నే।ధీరుండైన భ వత్పదాబ్జయుగళీదివ్యామృతస్వాది ని।స్సారం బంచుఁ దృణీకరించును మ రుత్సౌఖ్యంబు లాసించునే॥(శా)నీతత్వామృతసౌఖ్యము న్మరగియు న్నీది వ్యవిజ్ఞానని। ష్ణాతుండైన భవత్పదార్చకుఁడు సంసారంబు కాంక్షిం చునే। చూతస్వాదుఫలోపభోగములచే శోభిల్లు కీరంబు దాఁ।జేతః ప్రీ తిని రేఁగు బంటిరసముఁ సేవింపఁగా నేర్చునే॥

(శా)రాకానిర్మలచంద్రచంద్రికఁ జకోరం బాస్మసంతుష్టిగా। నా కాంక్షఁ భుజియించుఁ గాక తిమిరం బాసింపఁగాఁ గోరునే। నీకుంద క్రైన భక్తియుక్తుఁ డెపుడుఁ నీపాదసౌఖ్యార్థియై। యాకంజాతభ వాదిభోగముల నత్యల్పంబులఁ గోరునే॥(మ) కరిపోతంబు తదీయమా తృకుచ మాకాంక్షించుఁ గాకెట్లు సూ। కరవత్స్తోరుహాదుగ్ధధారల మ

దిక్ గామించునే దేవ నీ।చరణద్వంద్వపయోజభక్తి కల నాసౌఖ్యామృ
తాస్వాదిని। జరారాజ్యాదికదివ్యభోగముల నిస్సారంబులన్ గోరునే॥
(వ) భక్తికంటెను ముక్తి సాధకంబును నీకంటె నధికంబు లేదు గావున
నీపాదపద్మంబుల మీఁద భక్తియుఁ దక్క నామనంబన్యవరంబు గోర
దు నాకు జ్ఞానంబు విన నవధరింపు మని యిట్లనియె ॥ (క) మందర
కైలాసాచల।కందరముల సకలదేవగణమౌనిమనో। మందరపుణ్యస్థాన

(మహాదేవుండు పర్వతుని భక్తికి మెచ్చి యతనియందావిర్భవించుట.)

ము। లొందక నాశిరమునందు నుండఁగవలయున్॥ (వ) మేరునగంబు
మొదలైనపుణ్యపర్వతంబులు సకలదేవతామునీంద్రహృదయారవిందం
బులు సక్తృద్విహారస్థానంబులు గావించి నాశిరంబునందు సకలదేవతా
మునిగణసమేతంబుగా లింగాకారంబు దాల్చి పర్వతలింగంబన నవినా
భావసంబంధంబునం బ్రసిద్ధిం బడయవలయు నిన్ను దర్శనస్పర్శనపూ
జావిధానంబుల నర్చించువారికి నైహికాముష్మికసౌఖ్యంబులును నిత్య
కైవల్యభోగంబులు ననుగ్రహింప వలయునని వరంబు వేఁడిన నమ్మౌనీం
ద్రునివచనంబున కత్యంతసంతోషవికసితహృదయారవిందుండై యమ్మ
హాదేవుండిట్లనియె॥ (క) నీవిపుడు మమ్ము వేఁడిన।యీవరము పరోపకా
రహేతువు హితమున్। గావున నిక నొండడుగుము। ఏవాంఛితమైన నీకు
నిచ్చెద ననఘా॥ (గీ) అనఁ బరమేశ్వరునకు సాష్టాంగ మెరఁగి। యంత
కంతకు సంతోష మతిశయిల్లఁ।గరపుటాంజలి నిటలభాగమునఁ జేర్చి। ప్ర
మథనాయకు నిట్లని స్తుతించె॥ (క) విశదహిమధామధరునకుఁ।గుశరు
హగర్భాదిమౌనికులవంద్యునకున్। బశుపతికి భక్తపరిష।ద్వశునకు శ్రీ
లింగచక్రవర్తికి జేజే॥ (క) రుశ్యాంకధరునకును ముని। దృశ్యాకారున
కునాదిదేవునకు జగ।ద్దృశ్యాదిఫలదమూర్తికి।వశ్యస్నిగ్ధులునకు శైలభ
ర్తకు జేజే॥ (క) మహితహిమకిరణశిఖకు। ద్దహనాక్షునకు కాశానిలాంబు త

త్వాంమిళ। ద్రుహాదిపద్మభవాండో। ద్రుహిణునకు శ్రీలింగచక్రవర్తికి జే
జే॥ (క) వారుణ నతశతమఖముఖ। సురపరివృఢమకుటఘటిత శుభ
మాణిక్య స్ఫురితపదకమలునకు గణవరునకు శ్రీలింగచక్రవర్తికి జేజే॥
(క) లాగాటనయనహుతభు। కీలానిష్ఠీతమీనకేతనునకు సత్కీలాల
జసంభవముని పావనకర్తకును శైలభర్తకు జేజే॥ (క) శర్వాయక
మలజాతసు। పర్వప్రముఖానుపాలపాండిత్యకళా। ఖర్వాయ తే నమో
మహా। గర్వాపచీ రాయ తేన మోమృతసిధయే॥ (వ) అని స్తుతియించి మూ
డులోకంబులం గల పుణ్యపర్వతంబులు పుణ్యతీర్థంబులు పుణ్యనదులుం
బుణ్యాయతనంబులును నావిర్భవింప మూర్తిమంతంబులై పుణ్యము నిం
డ్రిసమేతంబుగా నుండ ననుగ్రహింపుము త త్తీర్థంబులు దర్శించినవా
రికిని యభిమతార్థంబులును స్వర్గాపవర్గాదిసౌఖ్యంబులును గరుణింపవ
లయునని వరంబు వేడిన నమ్మునీంద్రుని వచనంబుల కత్యంతసంతోషాయ
త్తచిత్తుండై మహాదేవుండిట్లనియె॥ (క) నీవిపుడు మమ్ము వేడిన। యీ
వరము పరోపకారహేతువు హితము। గావున నీక నొండడుగుము।
యీవాంఛితమైన నీకు నిచ్చెద నఘా ॥ (గీ) అనినఁ బరమేశ్వరునకు సా
ష్టాంగమెఱఁగి। యంతకంతకు సంతోష మతిశయిల్లఁ। గరపుటాంజలి నిట
లభాగమున మొగిచి। ప్రమథనాయకు నిట్లని ప్రస్తుతించె॥ అక్షరగద్యము॥
అఖిలలోకాధార । ఆనందరసపూర । ఇనచంద్రశిఖినేత్ర । ఈ
డితామరగాత్ర । ఉరులింగనిజరూప । ఊర్జితాచలచాప । ఋ
శ్యాంకకోటీర। ౠపజితోద్ధార। ఌళితతాండవకాండ। ౡానిర్మితా
జాండ। ఏకకైవల్యేశ। ఐశ్వర్యనిర్దేశ। ఓంకారదివ్యాంగ। ఔన్నత్యగణ
సంగ। అంబికాహృదయేశ। అస్తోకకలినాశ। కనదహీనాభరణ । ఖలజలం
ధరహరణ। గణనాయకవిధేయ। ఘనభక్తివిజ్ఞేయ। జస్థూలకాలహర। చ
తురత్రిశూలధర । ఛద్మయాగధ్వస్త। జలజశిరోహస్త । ఝుషస్ఫూర్తి
శృంగార । ఞవిదలగుణధీర। టత్రయాదివిహార। ఠప్రభాభాకార । డమరు
నాదవిహార। ఢక్కావాతపరిహార। ణప్రభాతఖ్యాత। తస్వరజనోపేత । థపర

హితజనపక్ష|దహనఫాలకటాక్ష|ధరణీరథోల్లీఢ|నందికేశారూఢ||పర్వ
తేశ్వరలింగ|ఫలదనేత్రాపాంగ|బహుళభూతివిలాస| భక్తహృత్పద్మవా
స|మంత్రస్తుతోదార|యక్షరుద్రాకార|రతిరాజబిసహంస | లలితగం
గోత్తంస|వరదశైలవిశాల | శరసంభవస్థాల|షట్త్రింశదుపరిగత|
కలసురమునివినుత|హరినేత్రపదపద్మ|దళితభూధరపద్మ | క్షురరప[illegible]
చారిత్ర|అక్షులోక్తస్తోత్ర|శ్రీపర్వతమహాలింగమహాదేవ నమస్తే నమస్తే
నమస్తే నమః|| అని వినుతించి మఱియును|| (మ) ధరసాష్టాంగము
లొంద మ్రొక్కి మఱియున్ దండప్రణామంబుతోఁ | గరముల్ ఫా
ళిఘటించి నిల్చి సుమనః కల్యాణసంధాయితే| పురదక్షాధ్వరఘస్మరా
య కరుణాంభోరాశయే శూలినే| గిరిజేశాయ నమశ్శివాయ యను
చు న్గీర్తించి యత్యున్నతిన్|| ఇట్లని విన్నవించె|| (సీ) సన్మనిబ్రాహ్మ
ణక్షత్రియవైశ్యాదికులవంతులైన దుష్కులజులైన | నెట్టి మానవులై
న నీశాన మామకశిఖరాగ్రసంవీక్ష సేయు నరుల | పూర్వజన్మార్జి
తోద్భూతకర్మంబులఁ బరివృతంబగు మహాపాతకములఁ| బొలియించి
శుభ మిచ్చి పుణ్యదేహులఁ జేసి కైవల్యనిత్యసౌఖ్యంబు లొసఁగు|సర్వ
సర్వంసహాధర శర్వ సర్వ | కమ్రనమ్రార్థిసుజనసంకల్పభూజ| కా
లకాలాఖ్య శివ కలకంఠకంఠ | సోమసోమార్ధధర బుధస్తోత్రపా
త్ర|| (క) నామీఁద జంతుసంఘము | నామీఁదన్ బ్రాలునట్టి నగసం
ఘములున్| గామితముక్తిసధూటీ|ధామాధిపులై సుఖింప దయచేయు
శివా|| (వ) నాశిఖరంబుఁ జూచిన నిఖిలమానవులకుఁ బునర్జన్మంబు
లేక జన్మాంతరంబులం గల పాతకంబులు దొలంగి భోగమోక్షంబులు
పొందునట్లుగా నాశిఖరదర్శనస్పర్శనముక్తిసత్రంబుగా ననుగ్రహిం
పవలయు ననిన నమ్మహాదేవుండతండు వేఁడినమూఁడువరంబుల నొసం
గసకలతీర్థంబులునుండ విశ్రుతంబుగాఁ బర్వతాకారంబుఁ దాల్చె నప్ప
ర్వతంబుమీఁద నమ్మహాదేవుండు పర్వతలింగనామంబునఁ బ్రాదుర్భ
వించె బ్రహ్మాదిదేవతలును దత్తత్ప్రదేశంబులనధివసించిరి కైలాసశిఖరి

యును శుక్తిమత్తుషారనీలాచలంబులును మైనాకమాణిక్యమహేంద్రమహీధరంబులును సైంధవకల్యాణసారంగసహ్యగంధమాదన కింశుకశ్వేతమాల్యవంతంబులును ఉదయగిరివర్ధమానవిద్యుత్ప్రవాళనిషధపుష్పశైలంబులును చిత్రకూటహేమకూటక్రౌంచవైరోచనపర్వతంబులును ఋష్యమూకేంద్రకీల మలయారోహణ పూర్వవింధ్యనగంబులును మానసోత్తరాద్రికులరాజ్యకేశశిలోచ్చయంబులును గోవర్ధన శత మేరుకుంజరమేచక పారియాత్రాది గోత్రంబులును మఱియు భాగీరథీపాతాళగంగా- పంచనద- గాయత్రి - శతద్రు-శోణవేదవతీ- శుక్లప్రభాసవేణీశ్వర- పుష్కరకృష్ణవేణీ- మలప్రహారి - సౌగంధికాదితీర్థంబులును విరజ కౌశిక గాంధార గంధవతీ కావేరీ వరుణాతుంగభద్రాప్రయాగకాశీసరస్వతీభోగవతీనర్మదా యమునా గయా తామ్రపర్ణీగోపతీ

—॥హరిబ్రహ్మాదులు పర్వతలింగంబును బరివేష్టించి కొలుచుట.॥—

సోమప్రభాసనందసరయూవైతరణీ వేగవతీ చంద్రభాగామహానదులు మొదలైన పుణ్యతీర్థంబులును పుణ్యనదులును దత్తత్ప్రదేశంబులఁ బ్రవహించె మఱియును॥(క) శ్రీగిరిశృంగపు మస్తకభాగంబున శివుఁడు నిలువ బ్రహ్మాచ్యుతులున్। నాగాప్సరమునిఖచరులు। వేగమ వసియించి రఖిలవిబుధప్రముఖుల్॥(గీ) స్థాణునవమార్తికచ్ఛత్రధరులలోన॥ వరుస నింద్రుఁడు ఛత్రంబు పట్టి కొలువ। సరస విహరించు తలవరి జనులలోనఁ। జాల బల యించు నిచ్చలు జముఁడు గొలుచు॥(సీ) పర్వతస్థానాధిపతులలో నొనగూడి కరిముఖషణ్ముఖు లదసి కొలువఁ। బర్వతనందిమహాకాళగణములు దౌవారికులలోన దరసి కొలువఁ। బర్వతప్రాంగణపరిచారకులలోనఁ వాయుక నిర్ఋతి పనులు సేయఁ। దాండవక్రీడావిధానతత్పరులలో నిలిచి యీశానుండు నృత్యమాడఁ। బండితోత్తమసభావిప్రతతిలోనఁ। గీతిఁ జండీశ్వరుండును గీతిఁ సేయఁ। జంద్రఖండాంశుతారకజ్వలనచయము। ఖండదీపంబులో పలఁ గలసి వెలుఁగ

గీ॥(క)అంగజజలంధరాసుర । భంగంబులు నంధకాదిభంజనములు సి।
బ్బంగిఁ బదికొండు గతులను। భృంగీశ్వరుఁ డాడు భూమి భృంగుసి కెల
నగ। (సీ)షడ్జంగతిక్రమచతుశ్రీతిణములవితతచతుర్విధవిభ్రమముల ద్వా
దశలాసములఁజతుష్షష్టిగతులముప్పదిమూడుమస్తకాస్ఫాలనములఁ। ద
రళసప్తస్వరతానటవ్యాప్తిని దశవిధకర్ణావధానములను । శోభితత్రి
విధవక్త్రవిలాసంబులనభిరామమిరుదివాభినయములఁ। దరుణకలహం
సగతులమాతంగగతుల । లీలవాయుతగతులనువివిధగతుల । నిలిచియు
చ్చరకాంతలునృత్యవిద్య । మెలఁగుచుందురుమత్యు భామినులఁగూడి॥
(శా) ముకుటంటింభజించుచు వేళలగతుల్ మోయంగనాట్యక్రియల్ ।
నికటంబున్ బచరింతురిందువదనల్ నేర్పున్ విడంబింపఁగా । జికటున్
మదలకాహళధ్వనిగతుల్ ఝుంఝుఁఝుణత్తుత్తుతూ । ధికంధింధిమిత
కటతోనకధిమింధీ యంచు ఘూర్ణిల్లఁగన్॥ (శా) పంకేజాతుల న
ర్తనంబు పటహప్రక్వాణవీణారటల్ । ఢంకారార్భటిమర్దలధ్వనిధ
మడ్ఢకాహడుకామహ । ఝుంకారానకజర్ఝర ప్రకరఝుంఝుం
ఝల్లరీనిక్వణ । ఢ్ఫంకారంబులు మోయు శ్రీనగముపైఁ బ్రాహ్లాది
కాలంబునన్॥ (సీ) మునులలోఁ గశ్యపముని దధీచ్యాదులు గలసి వే
పొద్దు శంకరు భజింప । భక్తులలోపలఁ బ్రమథాదిపతులెల్ల [illegible]
తలింగార్చనాసక్తి నిలుప । సంయమీంద్రులఁ గూడి సనకజప్రోక్త
లఁ బుండరీకాక్షులు పూజచేయఁ । బురధేనువులలోన సురధేనువులు

—(*) బ్రహ్మాదులుపర్వతుని శ్లాఘించుట. (*)—

నిల్వఁ దరులలోపలఁ గల్పతరులు బెరయ । నేడు సాగరములును న
వ్యేడు దీవు । లానగోపరిసకలదేశాంతరమున । నడఁగు ముల్లోక
ములు సచరాచరములు । బరగు సచరాచరంబుల ఖ్యాతి గని॥ (సీ)
ఇదియ క్రీడాస్థాన మింక మాకనుచును సనకాదిమునులును సంస్తుతింప।
గణుతింపఁ బ్రత్యక్షకైలాసమిది యని బ్రహ్మాదిసురలెల్లఁ బ్రస్తుతింప ।
శివపూజనక్రమాచితతపఃక్రియలకుఁ జనును మానితభక్తసంతతి మెల్ల।

శ్రీపర్వతాధీశు సేవింపఁ గంటిమి పర్వతేంద్రుసితపఃఫలమువలన । ననుచు సంతోషమున గౌతమాత్రికణ్వ । వామదేవాదినారదవత్సగర్గ । మునులు తమలోన సంతోషములు ఘటిల్లఁ । బ్రస్తుతింపుచు నిట్లని పలికి రంత॥ (క) శ్రీవాణీశసురేంద్రులు।నీవిధమున నిరువదేను నెనిమిది కోటుల్ । దేవాధికారములుగల।దేవత లీవరము వేడఁ దెలియరు బుద్ధిన్ ॥ (మ) తనయుం గన్న శిలాదమౌనియు మహాధన్యుండు సత్పుత్రులన్ । గనినన్ లోకహితార్థియై యాటఁ బితృవాక్యస్ఫూర్తిన్ యంకెవ్వరున్ । గని పెంపన్ గడు తెస్సగాదె చలమే కష్టంబు దుష్పుత్రులన్ । గనదే సూకరి పోతముల్ గరిపరిహారంబు శోభిల్లునే॥ (మ) కనియెన్ బుత్రు శిలాదమౌనియ పురాగణ్యుండు మాయయ్య దా।గనియెన్ బుత్రుని భక్తవర్ధనకళాకారప్రభావోదయున్ । గనియెన్ బుత్రుని లోకపావనపరిహారక్రియామార్గమున్ । గనియెన్ దర్శనముక్తిసత్రము ధరం గావించె బ్రఖ్యాతిగన్॥ (ఉ) నెయ్యముతోఁ గులద్వయవినిందితులై శివభక్తిహీనులై । కొయ్యతనంబునన్ దిరుగు కొయ్యల నెన్నఁగ నేల వారలన్ । దయ్య మెఱుంగు భక్తజనతత్పరుఁ బర్వతపుణ్యమూర్తిన మా।యయ్యను లోకపావనుని నాత్మఁ దలంచిన ముక్తిచేకుఱున్॥ (క) పరమేశ్వరవిమలకృపా । పరమసుధాసారసిక్తపావనమూర్తిన్ । గరుణారసతోయదము।బరహితగుణరత్నవార్ధిఁ బర్వతుఁ దలఁతున్॥ (గీ) తత్పరత్వంబు సంధిల్లఁ దపముఁ జేసి। శంభు దేహంబు శాంభవి సగముపడసె। బర్వతుండను మౌనితపంబుఁ జేసి।దర్పకారాతిదేహ మంతయునుబడసె॥ (వ) అనిన వేదవ్యాసుండు తరువాతి కథావిధానం బెట్టి దనిన సనత్కుమారుం డిట్లనియె॥ (క) సేవాగతసురకోటీ । రావిష్కృతరత్నకిరణరంజితచరణా । తావకనుతిగంగాభః।పావనితజగజ్జనాంగ పర్వతలింగ॥ (శా) బాలేందుద్యు

—(*) ఆశ్వాసాంతము. (*)—

తిమౌళిభాగబలభిత్ప్రత్యర్థివిధ్వంసికా । బాలవ్యాయత నేత్రదక్షిణ

దిశాబాధోధిపీచీపయఃఖేలోత్తుంగతరంగరంగితపరిక్రీడానభస్వద్వసా
స్థూలాంగోరగరాట్ఫణామణికళాశుంభద్భుజామండలా॥

(మాలినీవృత్తము.)

ఖరకరశశినేత్రా గర్వితానంగజైత్రా । సరసధనదమిత్రా శైల
కన్యాకళత్రా । విరసదనుజనాశా విశ్వలోకప్రకాశా । పరమసుఖ
నివేశా పర్వతాధీశ్వరేశా॥

గద్యము॥ ఇది శ్రీమల్లికార్జునకృపాలబ్ధమేదురాష్టభా
షావిశిష్టశివయోగవర్య శేషనాధార్య ప్రణీతం
బైన శ్రీ పర్వతమహాత్మ్యంబు నందు
ద్వితీయాశ్వాసము.
శ్రీసాంబసదాశివార్పణమస్తు.





శ్రీ ర స్తు.

శ్రీగణాధిపతయే నమః.

శ్రీపర్వతపురాణము- తృతీయాశ్వాసము.

(క) శ్రీశైలపుణ్యమహిమము। లా శైలతనూజవినుచు నానంద
సుధా।రాశిరసకేళిఁ దేలుచు। నీశానుఁ జూచి త్రిభువనేశ్వరిపలికెన్॥
(క) శ్రీనగమునఁగల పుణ్య।స్థానంబులఁ బుణ్యతీర్థతతులన్ దెలియం।
గా నానతిఁ గృపజేయుము। గానామృతరసవిలోలకరుణాపాంగా॥(వ)
అనిననమ్మహాదేవుండు పార్వతీదేవికిఁ గృపాయత్తచిత్తుండై యిట్లనియె॥

—(*)పర్వతశిఖరాష్టకతత్తీర్థతన్నామతత్ఫలంబులం దెల్పుట (*)—

(సీ) పర్వతభూమి ముప్పదియోజనంబుల వెడలుపు నిడుపుఁ దద్విస్తృ
తంబు। కమ్రజనాభీష్టకామ్యప్రదైశ్వర్యధన్యంబు లగు చతుర్ద్వారము
లును। గామితఫలసిద్ధి కారణసౌఖ్యసాధ్యము లెనిమిది యుపద్వారము
లును। షోడశసంఖ్యాతశోభితాలంకారకరణంబులగు గవాక్షములుగలిగి।
భుక్తిముక్తిస్థలోపేతపుణ్యతీర్థ। శక్తిభైరవదేవతాసంయుతమింద్ర। పా
వనాశ్రమశివలింగపరికరాఢ్య। శిఖరశోభావిలాసంబు శ్రీనగంబు॥ (క) శి
రిగిరిశిఖరము లెనిమిది।సరసిరుహభవాండతీర్థసారము లెల్లన్।వరుసగి
లుమాడిపుణ్య। స్ఫురణంబున నితరగిరుల పురులం దెగడున్॥ (క) అ
య్యెనిమిది శిఖరంబులు। ముయ్యెనిమిది నదులు సకలమునిసేవకపా । ని
య్యంబులకలిమి నిగమ।నియ్యామృతరసవిభాతి నెలకొనియుండున్॥వచ
నము॥ మొదలిశృంగంబున సానందియునందియు- శుక్లయు - ననునా
మంబులుంగలిగి తీర్థత్రయంబు ప్రవర్తించు రెండవశిఖరంబున గోమతి
యుఁగీర్తియుఁ గళయునను నామంబులుం గలిగితీర్థంబు ప్రవహించు
మూడవశిఖరంబునఁ బ్రామ యు-జాహ్నవియు-విచిత్రయుననుతీర్థంబులు

సంధిల్లు నాలవశిఖరంబుననబ్జారతియుఁ జారుఘోషణియును నగణియును నసుతీర్థంబులు సల్లసిల్లు నైదవశిఖరంబున జ్యోతియు జయయు విజయయు ననుతీర్థంబులధివసించు నాఱవశిఖరంబున క్రియయు బృధువును నచ్చిష్మతియునను తీర్థంబులువిలసిల్లు నేడవశిఖరంబున జ్యోతియునచ్ఛయుఁ జతుర్వక్త్రియునను తీర్థంబులువసియించు నెనిమిదవ శిఖరంబున నచ్ఛవయు క్షేమయు శుక్లయు ననుతీర్థంబులు ప్రవహించుఁ దత్తీర్థంబులఁ గృతస్నానంబులైన మానవులకు నశ్వమేధసహస్రంబులును వాజపేయశతంబును జేయుఫలంబుసిద్ధించు నాశిఖరంబు లెయ్యవి యంటేని॥ (సీ) వైడూర్యశిఖరంబు వాసవసేవ్యంబుఁ ద్రిపురాంతకం బనాఁ దేజరిల్లుఁ। బశ్చిమశిఖరంబు బ్రహ్మేశ్వరంబని పంకజాసనుఁ డందుఁ బరిఢవించు। మాణిక్యశిఖరంబు మర్త్యగణాకీర్ణ మది మహేశ్వరమందు రభినుతంబు। వైభవాన్వితము ప్రవాళశృంగంబును బుష్పశైలము మరుత్పూజితంబుఁ। బావనాకారతాపసప్రకరభాస్వ। దమరవిద్యాధరాప్సరోయక్షసిద్ధ। కిన్నరోరగగంధర్వఖేచరేంద్ర। సేవ్యమానంబు శ్రీశైలశిఖరరాజి॥(సీ) ఈడితస్కంధసోమేశ్వరంబును రౌప్యశృంగంబు నందు వసించు గుహుఁడు। మొదలి శృంగము దేవమునిగణోపాస్యంబు నది హేమశిఖరంబు నభినవంబు। మరకతశృంగంబు మధువైరి నిలయంబు నది యుమాబిల నామ మతిశయిల్లు। నానంది మండలం బది వజ్రశృంగంబుఁ బ్రీవధుల లోనంది పరిఢవించుఁ। బావనాకారతాపసప్రకరభాస్వ। దమరవిద్యాధరాప్సరోయక్షసిద్ధ। కిన్నరోరగగంధర్వఖేచరేంద్ర। సేవ్యమానంబు శ్రీశైలశిఖరరాజి॥(వ) అని మఱియును॥(సీ) వసుమతి యను మునీశ్వరపుత్రి సుకుమారి కలహంసగామిని కంబుకంఠి। యప్పర్వతమున నయ్యిందుబింబానన తరలాక్షి యత్యుగ్రతపము చేయఁ। బంకజాసనుఁ డంతఁ బ్రత్యక్షమై నిచ్చి యంబుజానన వరం బడుగు మనిన। వసుమతి నాపేరు విసుదాన మిది యొల్ల శ్రీనామ మొసఁగు మీప్సితము నాకు। ననినఁ గమలాసనుఁడు వరం బతి వకొసఁగినట్టి శ్రీదేవి యపుడు నీయద్రి మీదఁ।

—॥ కార్తికాదిమాసంబునందు శ్రీగిరికిఁ జనిన కలుగుఫలములు. ॥—

బర్వతేశ్వరుఁ బాయక భక్తిఁ గొలువ। శ్రీనగంబన జగతిఁ బ్రసిద్ధ మ య్యె (క) మనుజుఁడు కార్తికమాసంబున నిశ్చలతత్పరత్వమున శ్రీనగ ముఁ। గనుఁగొనినంత గలుగును। ననఘునకును వాజపేయ యజ్ఞఫలం బుల్॥ (క) వేసరక మార్గశిరమను। మాసంబున శ్రీనగంబు మనుజుఁడు గనినన్। జేసిన దురితము దొలఁగును। భాసిల్లును పౌండరీకబహుమఖఫల ముల్॥ (గీ) పుష్యమాసంబునందు నేపురుషుఁడైన। బర్వతంబున కేగిన పావనాంగుఁ। డగును జాతకనిర్ముక్తుఁ డగును బుణ్యు।డతఁడు పొందు ను నతిరాత్రయజ్ఞఫలము॥ (గీ) మాఘమాసంబునందు నేమనుజుఁడైన। శ్రీ నగంబున కేగినఁ జేర వెలుచు।నఘశతంబులు రాజసూయాధ్వరములు। సేయు ఫలములఁ బొందు నిశ్శ్రేయసంబు॥ (క) కృతకృత్యుఁడైన నరుఁ డీ। క్షితి ఫాల్గున మాసమునను శ్రీగిరి కరుగన్।హతకల్మషుఁ డగుఁ గలుగును। నతనికి సౌత్రామణీమహాధ్వరఫలమున్॥ (క) మధుమాసంబున శ్రీగిరి।విధి యుక్తముగాఁగఁ జూచు విమలాత్మునకున్। బ్రథితశుభంబులు చేకుఱు। నధికం బగు బహుసువర్ణయజ్ఞఫలంబుల్॥ (క) వైశాఖమాసమున నా। శ్రీశైలముఁ జూచు నతఁడు జితమోహతమః।పాశుఁ డగు లక్షగోవులఁ। బేశలమతులకును నొసఁగు పెంపు వహించున్॥ (గీ) శ్రీనగంబున కెవ్వం డు జ్యేష్ఠమాస।మునఁ బ్రయాణంబు సేయున పుణ్యునకును।వాంఛితార్ థంబుఁ గోటిసువర్ణదాన। ఫలము సిద్ధించు సకలశుభంబు లొందు॥ (క) జను లెవ్వరేని నియతం।బునఁ జని యాషాఢమాసమున శ్రీనగమున్। గనుఁగొనినఁ గోటిగోవుల।ననఘున కర్పించు ఫలము లప్పుడ కలుగున్॥ (క) వెండియు మనుజుఁడు శ్రావణ। కాండంబున శ్రీనగంబుఁ గనుఁగొని నంతన్।బండితునకు యోజనమును।పండిన చేనిచ్చునట్టి ఫలములు గలు గున్॥ (క) అతిభక్తి భాద్రపదమున। గతికోలకును నరుఁడు శ్రీనగంబున కరుగన్। గుతుకమునఁ గోటిగోవుల।గృతమతులకు నిచ్చు తత్సుకృతము లు గలుగున్॥ (క) అతిశయనియతవ్రతసం। యుతుఁడై శ్రీనగము నాశ్వ

యాజనునఁ జూడఁగ । మతిమంతునకును వేవ్వుర । నతివల నవిఁజేంచు ఫలమ
హాత్మ్యము గలుగున్ ॥(క)సిరిగిరి కరిగిన మనుజుం । డరుగును నాందోళికా

*శ్రీపర్వతలింగమునకు నుపచారములు సేయువారికి గలుగుఫలము.*

ధియానంబునఁ గా । ఖ్యగిరికి హేమచామర । వరరత్నచ్ఛత్రముఖ్యవైభ
వయుతుఁడై ॥(క)పరమేశు నభవుఁ గమ్మని । విరులన్ బూజించు నతఁడు
విభవము లందున్ । సురమస్తకవ్రజ । పరిషేకోజ్జ్వలితపాదపద్మా
న్వితుఁడై ॥ (ఉ)గంగను దాన మాడి కలకంఠుని శ్రీగిరిమల్లికార్జునున్ ।
మంగళగీతవాద్యమహిమ స్తవపాఠము లుల్లసిల్లఁగా । సంగతిఁ బూన్చి
మర్త్యులకు సౌఖ్యము లెందును నందఁ గల్గు వా । రాంగన లట్లు చేయు
దు రనంతవిలాసులు ముక్తికామినుల్ ॥(శా)దుత్తూరంబుల బిల్వహల్లక
ములన్ ద్రోణాదిపుష్పంబులన్ । దత్తద్వేళలమల్లికార్జునుని నేకస్వాం
తు పూజించినన్ । దొత్తు న్వారికి ముక్తికామినులు నస్తోకంబులై శ్వర్య
ముల్ । బత్తు ల్పంకజసంభవాదు లివి సౌభాగ్యప్రభావోన్నతుల్ ॥ (క)పర
మేశ్వరుఁ బంచామృత । పరిషేకమహోపహారభజనపరుండై । నరుఁ
డొందు సకలజగతీ । పరివృఢరాజ్యాభిషేకబహువైభవముల్ ॥ (క)మల
హరు గుడి గోమయమున । నలికిన మర్త్యుండు నలఁదు నటఁ గస్తూరి ।
మలయజపంకము దివిప । జ్జలజాయతలోచనాకుచద్వయవీధిన్ ॥
(క)శ్రీరాజధరుని రమ్యా । గారముఁ గప్పించి నట్టి ఘనుఁడు సుఖించున్ ।
దారాచలకంధరశృం । గారప్రాసాదరుద్రగణముల నడుమన్ ॥ (మ)ర
తిపధ్వంస మహేశ శంకర శివా రాజార్ధకోటీర యం । చితభక్తిన్
బ్రణుతించు నెప్పుడు మహాయత్నంబుతో నాతఁ డా । చతురాస్యాదిని
లింపపుంగవులు హస్తాంభోజముల్ మోడ్చి సం । స్తుతి సేయన్ విహరిం
చుఁ దారగిరిపై శుంభద్గుణశ్రేష్ఠుఁడై ॥(క)శివ భవ హర యను పఠనా ।
రవములు కైవల్యరాజ్యరమణీయమహా । స్వనడిండిమఢక్కానక, వివి
ధాభంగాటితఝల్లరీనవీనస్వరముల్ ॥(క)నగరాణ్ణిలయుని దేహము । సగ
ము తపోధనముచేత జట్టిగఁ గొని మ । జ్జగములను వెలసియుండును । న

గసుత శ్రీగిరిని నర్ధనారీమణియై॥ (క) యుక్తులు నిగమములావృత। శక్తులు గంధర్వదివిజసారసనయనల్। భక్తులు దివ్యామృతములు। భక్తులు బ్రహ్మాదిసురలు భ్రమరాంబికకున్॥ (వ) అర్ధనారీదేవియును భ్రమ

—(*) శ్రీశైలతీర్థమాహాత్మ్యంబులు సనత్కుమారుండు కృష్ణద్వైపాయనునకుఁ జెప్పుట. (*)—

రాంబికయును శ్రీశైలంబునకు నాదిశక్తిస్థానంబులు తదీయమందిరంబు లనిశ్చలచిత్తులై తపంబుసేయువారికి సకలమనోరథార్థసిద్ధులు సిద్ధించు మఱియు శ్రీశైలతీర్థమాహాత్మ్యం బెట్టిదనిన॥ (క) శ్రీగంగాకంఠమస్తక। భాగాపరదీర్ఘికాంబు పావనకిరణ। ప్రాగల్భ్యోన్నతి మెఱయును। నాగడ్డిగ భావిపావనాంభఃకణముల్॥ (చ) సమధికభుక్తిముక్తు లిడఁజాలిన గడ్డిగబావివేణికా। విమలపయఃకణచ్ఛటలు విస్తరిలీలలఁ బ్రసరించు నక్రమలభవాండమధ్య పరికల్పితపుణ్యవసుంధరాతలోద్గమబహుతీర్థవారిహారి ఘట్టసముద్భవపావనంబులన్॥ (క) ఆ మల్లికార్జునేశ్వర। నామప్రఖ్యాతిపావనస్థితపయో। ధామమగుమల్లిగుండము। భూమిం బ్రసిద్ధంబుఁ బొందెఁ బుణ్యోన్నతులన్॥ (వ) తత్తీర్థంబునం గృతస్నానులైన మానవులు ముక్కన్నును చతుర్భుజంబులును మొదలైన రుద్రచిహ్నంబులుగల ప్రమథాధీశ్వరులై సారూప్యపదంబుం బొందుదురు తత్సమీపంబున॥ (క) కుండీమండపభైరవ। ఖండీపరివేష్టిత ప్రశంసితపుణ్యా। ఖండీకృతఘనఘంటా। కుండీతీర్థంబు జనులకున్ శుభమొసగున్॥ (క) ఘంటాసిద్ధేశ్వరునఘు। ఘంటాంకునకుం గశౌర్యలుంఛనసేవా। ఘంటాపదపరివర్తక ఘంటాకర్ణాభకర్ణుకరగోకర్ణున్॥ దర్శించి॥ ఘంటికాకుండశుద్ధోదకంబులందు। దానమొనరించి తల్లింగదర్శనంబుఁ। జేయు జనులకు నభిమతసిద్ధులొదవు। బ్రహ్మహత్యాదిపాతకప్రతతి దొలఁగు॥ (క) కోటీరశశిభానని। హాటకగర్భాదిదేవతాధీనమన। శ్చాటుపదనిలయుఁ ద్రిపురని। ఘాటాహంకారహరణసారంగేశున్॥ (గీ) భక్తిదర్శించుజనులకుఁ బాయుదురిత। మఖిలకల్యాణవిభవంబు లతిశయిల్లు। నరులు తత్తీర్థము

సంగృతస్నానులైన। సకలకామ్యార్థతతులను సంభావించు॥ (క) తీం
డములు పుణ్యతతులు ప్రచండములఘములను ద్రోల జననాంబుజవేదండ
ములు చంద్రభాసహర। కుండము లనిశంబుఁ గేలిఁ గొనుఁ బెరసనుల౯॥
(క) భావిత తాపసతీర్థక। సేవకులకు వాంఛితార్థసిద్ధులనొసఁగు౯।
లావుక వరాహకుండీ। భావుకవిదిశంఖచక్రభవకుండంబుల్॥ (క) దు
స్తరదబహుజన్మాంతర। కర్మోద్భవదురితపాశఖండనకలనా।నిర్మా
ణపుణ్యఫలదము। కర్మారీశ్వర మభీష్టకారణమనఘా॥ (క) నిర్మలపు
ణ్యోన్నతిచే। శర్మదపరఫలవిశేషసామర్థ్యములన్। నిర్మింపఁ జాలు
తీర్థము।కర్మారీశ్వరము సాటిగలదే జగతిన్॥ (క) హాటకశైలధను
ర్ధరు।నాటవికప్రకరసేవ్యు నాదివ్యసరి। జ్జూటీకుడుంగసంగుని। హాటకశి
వలింగదేవు హరునీక్షింపన్॥ (గీ) తొలఁగు దురితంబు శుభములు తొం
గలించు।హాటకేశ్వరతీర్థంబు నంటఁ గ్రుంకి। పంచపల్లవధారాదిభవ్య
తీర్థ।సేవకంబుల నిష్టార్థసిద్ధులొదవు॥ (శా) శ్రీమద్భోగవతీస స్వ
తులు నా శ్రీకోటిలింగాచలం। బా మందాకినికిన్న రేశసదనం బా పుణ్యగం
గాచల।స్తోమంబున్ శిఖరేశ్వరంబు భువనస్తుత్యంబులత్యున్నతి। ప్రేమం
జూచిన మర్త్యకోటికి శుభాభీష్టార్థముల్ జేకుఱున్॥ (మ) బలవద్దో
షలతాలవిత్రములగున్ బాతాళగంగానదీ। జలముల్ ప్రస్తరిసేయు న
కల్మలసంజాతాండమధ్యావనీ। స్థలకేదారగయాప్రయాగసీమవ
ద్వారాణసీసేతుమే। ఖలకన్యా యమునానదీసలిల రంగత్పావనశ్రేణు
లన్॥ (సీ) అనిమిషలోచనయానవర్ణసనాభి పృథురథాంగ స్తనఫేన
హార। శృంగారసైకతశ్రీజఘనస్థలివికచపద్మాననవిద్రుమోష్ఠి। కంబుకం
ధరిమధుకరనీలకుంతలి యంభోజపుష్పరసాంగరాగ। మహనీయకల్లోల
మానికాకరయుగ్మ యభిరామనవకలహంసయాన। గరుడశైలనదీనొ
ష్ఠపాతకవిభంగ నగనటోత్సంగ దురితసన్నగవిహంగ। భవశిరస్సంగ
సేవితపావనాంగ। తరళరంగత్తరంగ పాతాళగంగ॥ (క) గంగ
లోపల నక్కలకంఠమూర్తిన్। పాదపద్మంబు లుండుఁ దక్షాంగ్రింతమున

ను। నఘహారంబగు యమకోణ మనఁగ గలదు।అచట ధర్మంబుఁ జేసి
న నక్షయంబు॥ (క) గతికోటులకు భక్తితత్పరు।వతురు దైౖ రుద్రపాద
సన్నిధిసుందుర్ । బితరులకు నన్న మిడినను। సతతముఁ బితృకోటి క
ధిక సంప్రాప్తి యగుర్॥ (క) ఆయమకోణము దూఱన । నాయతమ
హిమమున దూఱు నట మర్త్యుఁడు గాం। గేయప్రాసాదాలయ।భూ
యిష్టపరేత రాజ్యశైరతోరణముర్॥ (క) గంగాస్నానము సంతత।మం
గళకారణము జనకమాతృకుల వ్యా । సంగదురితాపహరణము । గం
గాస్నానంబు మోక్షగతిహేతు వగుర్॥ (శా) గంగాతీరములందు సై
కతపరిష్కారస్థలస్థాయ సై। గాంగేయాద్రిధనుర్ధరుర్ ఫణిపతిగ్రై
వేయసౌగంధిక। త్వంగద్బిల్వపయోరుహాంబుల మదిర్ దాత్పర్యభక్తిక్రి
యా।సాంగత్యంబున గొల్చు పుణ్యులు గదా సౌభాగ్యభాగ్యోదయుల్॥
(శా) సాహంకారవిహారనిర్పటునాట్యాగంభసంరంభముల్ । మో
హధ్వాంతవిఘాతసంయమిజనామోదస్తుతిధ్యానమ । త్యూహాపోహ
పురాణశాస్త్రపఠనోద్యుక్తప్రతీరంబులర్ । మాహాత్మ్యంబుగ నీకెయొ
ప్పును గదా పాతాళగంగానదీ ॥ (వ) అని స్తుతింపుచున్న సనత్కు
మారుం జూచి వేదవ్యాసుండు తరువాతి కథావిధానం బెట్టిదనిన న
న్మునీంద్రుం డిట్లు లనియె॥ (క) పాదపకాష్ఠజ్యోతి। ర్వాదవయో స్తం
భవశ్యవజ్రిశరీర। ప్రాదుర్భామౌషధసం । వాదనములు చంద్రగుప్త
వనపర్వతముల్॥ (క) తొమ్మిది కదళీవనములు । దొమ్మిది శరభూ
రుహములుఁ దొమ్మిది బిలముల్।దొమ్మిది యమృతపు బావులుఁ।దొమ్మం
డుప్రపు గాధిపతులు దోర్బలయుక్తుల్॥ (క) మదలీలాశుకకోకిల। పద
లీవ్యూహపాదపస్తబకశిఖా।సదళీరవగానాంచిత । కదళీవనశోభితము
లు కడు నద్భుతముల్ ॥ (శా) భూమాంకోలాసిలభుగ్భుజంగము మ
హాంభోజాతమాతంగముర్ । ధీమద్యోగిమనోనిషంగము మరుద్వ్యాఘ్ర
మోత్సంగముర్ । సామర్థ్యోన్నతిదిక్కురంగము మునిస్వాంతాబ్జ
సంసంగముర్ । శ్రీమత్పర్వతశృంగముర్ బిరిచితశ్రేయోంగనాసంగ

ము॥ (క) అటఁ జని శిఖరముఁ జూచిన నటఁ జూడఁడు నరుఁడు నిర్భ
రాటోపకళా । కుటిలయమరాడ్భయంకర చటులభ్రుకుటీకృతోగ్రస
మరముఖంబున్ ॥ (గీ) ఇట్లు శిఖరంబుఁ గని శిఖరేశలింగ దర్శనంబు
నసకలపాతకము లెల్లఁ బాసి శుభములు పొందు నప్పుడు జనుఁడు కమి
తకైవల్యనిత్యసౌఖ్యములు గలుఁగు॥ (క) ధరణి నుత్తరద్వారతీర్థము
లలోనఁ బుణ్యతమములు సర్వేశపుష్కరంబులనెడి నదములు పావనా
యతమహత్వమహిమ వర్ణింప నరిది పద్మజునకైన ॥ (శా) శ్రీపంచా
ననభక్తసంఘ మెప్పుడున్ సేవింపఁగా భూమిభృచ్ఛాపశ్రీకరనామశ
క్తి వెలయన్ సర్వేశతీర్థంబునన్ । పాపాత్ములుఁ గ్రుంకిరేని యొ
డలన్ బంకంబు సంధించునే పాపశ్రేణులు గ్రుంకనీ ఫలశుభప్రాప్తియుం

—(*) సర్వేశపుష్కరనదుల మహిమ. (*)—

బు తోయంబగున్॥ (క) దుర్వారదుష్టదుష్కృత దుర్వారాగర్వాప
హారణలోయమహత్వ శివప్రవాహశక్తిని । సర్వేశ్వరతీర్థమున
కు సరియే నదముల్॥ (మ) మనుజశ్రేణులు దానమాడను శిలామధ్యం
బుపై నిల్చినన్ । ఘనదుష్కర్ములైనఁ బైఁబడకఁ దగ్ధాఘపా
కంతంబులన్ । జవ లంఘించి తొలంగు పుణ్యులపయిన్ సంధిల్లవర్షం
చున । ద్దివ్యకృత్యంబు పవిత్రపుష్కరమహాతీర్థాంబుధారావళుల్॥
(ఉ) నిష్కపటప్రవృద్ధజననిర్మలచిత్తవికాసభావనా । విష్కృతతీర్థ
సారకు నవీనపవిత్రమహత్వపూరకున్ దుష్కృతకర్మదుర్భవవిధూ
తవిచారకుఁ బుణ్యనీరకున్ పుష్కరతీర్థసారకుఁ బ్రభూతవిహారకు సా
టియే నదుల్ ॥ (క) ఘోరాఘధారుణీధర ధారాధర దాహశస్త్ర ధా
రాఘురసా ధారణమహిమోజ్జ్వలజల । ధారన్ బుష్కరమహానదము
పెంపొందున్ ॥ (వ) ఈతీర్థద్వయంబును మనుష్యుల పుణ్యపాపంబు
లేపఱచి తత్క్షణంబ శుద్ధాత్ములం జేయు వెండియు॥ (క) లాలసన
గాభైరవజాల ప్రఖ్యాతతీర్థసారము ముక్తి । శ్రీలలనాముఖముక

రము। ఏలేశ్వర మఖిలలోక వందిత మనఘా॥ క॥ తొమ్మిది దుర్గంబు ల
రుదుగ। దొమ్మిది నరసింహములును దొమ్మిది గిరులున్ । దొమ్మండ్రు
భైరవులు సురి॥ తొమ్మిది లింగస్థలములు దుష్కృతహరముల్। ఉ॥ పంక
జగర్భ విష్ణుబలభంజన మాఖ్యపదంబులున్ నిరాతంక సమస్తభోగములు
జారనొసచ్చు మనుష్యకోటికిన్ । శ్రీకరునిత్యమందిరము సర్వమనోహ
రసౌఖ్యదంబు పా। లంకకు సాటి విశ్వవిపులస్థితి నెన్నఁగ నెవ్వి దీర్ఘ
ముల్॥ క॥ కోరి-చిన కామితఫల। జాలము లనిశంబుఁ బంచజలకు నొ
సఁగ। జాలిన పుణ్యస్థల మగు। పాలంకకు సరియె యితరభివ్యస్థముల్॥
(క) అహరుహమికోర క్షత। సహితశివప్రమథదివిజసంయమిపరుష। ద్స
హృపుణ్యాకరము ధరణీ। మహిళామండలము నందిమండల మనఘా॥(క)
నవనందిమండలంబులు। నవకుండికతీర్థపావనస్థానంబుల్। నవనందికే
శ్వరులు నభినవభక్తులు ముక్తులిడు సనాతనమూర్తుల్॥ (వచనము)
నందికేశ్వరుండు తపంబు చేయు మహత్వంబున నందిమండలంబు నామం
బయ్యె నక్కడ వసించు సమస్తజంతువులకును సపవర్గసౌఖ్యంబులు
గలుగు నానందిస్థలంబులును దత్తీరంబులు దర్శించిన మానవులకుం గా
మితార్థంబులును భోగమోక్షంబులున్ గలుగు వెండియు॥(ఉ) శ్రీనగ
కంధరంబుల వసించి చరించు పుళిందబృందముల్। భూనుతభోగమోక్ష
ములఁ బొందఁగఁ జూచి నిలింపసంఘముల్। శ్రీనిలయాభిరామ మగు శ్రీ
గిరి మీఁదఁ జరింతు రట్టుల। మ్మానితనాకసౌఖ్యమహిమంబుల నెల్లఁ
దృణీకరింపుచున్॥(మ) కలనారంభమనోరథాంబువులు రాగద్వేషఫేనం
బులన్ । మలమాయామయజంతుసంఘములుఁ గామక్రోధకల్లోలము
ల్। కలుషావర్తము లంగభోగతటముల్ కల్పించు జన్మాంబుధిన్। జలబిం
దుక్రియ దాఁటు మానవుఁడు శ్రీశైలస్థలస్థాయియై॥(సీ) ఎందఱికైనను
నిచ్చుమోక్షములఁ దాల్పఁ దరుణేందుకళ లెన్ని దాఁచినాఁడొ। యెందఱి
కైనను నిచ్చు నెక్కుడు కోడె లాల కోడియ లెన్ని వేలు గలవొ। యెం
దఱికైనను నిచ్చు హాలాహలకస్వంబు లవి యెన్ని గలవొ కాని। యెం

దఱికైనను నిచ్చు భూషణములు కాకోదరము లెన్ని గలవో కాని। శ్రీ
నగంబున సజ్జనశ్రేణి మీఁద।వాంఛ యెట్టిదో తాన పవర్గ మొసఁగు।
నాశ్రితానుసంఘూరుహం బగునో కాదో।విశ్వనాథుండు శ్రీపర్వతేశ్వ
రుండు॥(చ)మశకపిపీలికాశలభమత్కుణకోటిపిరాజి శ్రీగిరిన్। విశసన
మొందు మీఁద నశివిశ్వేశురుత్వముఖాసురచ్ఛటా। కుశరుహరాగరత్న
రుచికుంభిత మౌళివిరాజితాంగులై। శశిధరపార్శ్వభాగపరివర్త్రము
ధాధిపు లౌదు రున్నతిన్॥
(క)కరి కరిచర్మము గట్టును। హరిణియు హరిణంబుఁ బట్టు నహియు
హిఁ దాల్చున్। ధరియించు శశిని శశకము సిరిగిరిఁ గలజంతుమహిమఁ
చిత్రము గాదే॥(క)మంచిది మహేంద్రశైలము। పంచాస్యున్ జంచుఁ జే
సెఁ బర్వతమని దాఁ।జంచులఁ బరిచాస్యులఁ గా।వించున్ విన మెంచు
నిట్టి విస్మయమహిమల్॥(క)చెంగటి గడ్డికి బావియు।ముంగలి పాతాళ
గంగ ముక్తివధూటీ। సంగము శిఖరేశ్వరమును।సంగతి గల శ్రీనగంబు
సరియే నగముల్॥(క)లక్షకుఁ గేదారంబును।లక్షద్వయమునకుఁ గాశిరా
గున గయలో।లక్షకు నేడింటికి మఱి। భిక్షము శ్రీశైలమునను బెట్టిన ఫల
ముల్॥(క)మనుజుండు శ్రీగిరిఁ బుణ్యము। గొనకొని చేసినను గోటి గుణి
తంబగు న।మ్మనుజుండు శ్రీగిరిఁ బాపము గొనకొని చేసినను గోటిగుణి
తంబు లగున్॥ (సీ)ఏదేవునకు శిఖరేశ్వరంబ శాంతలాలితక్రీడాచలస్థ
లంబు। రేవనే వెల్లు క్రీడించుఁ గేళాకూళితరళతరంగపాతాళగంగ।
యే దేవునకుఁ గూర్మి హేళాకళావతిభ్రమరాంబ భవ్యప్రభాకరం
బు।భైరవాదిక్షేత్రపాలకప్రవరులు ప్రహరిఁ జరింతురే భవ్యమూర్తి।
నట్టి శ్రీమన్మహాదేవు నసుఁగు పురము।గూఢసంజీవనీవని కుంజపుంజ। మ
ధిత్రోన్నిద్రకల్పద్రుమాపికూప। భర్మమహమ్యోన్నతంబు శ్రీపర్వతం
బు ॥ క ॥ దానములు కిన్నగశ్రీ। గానముల సమస్త పాతకప్రచ
యములన్। లూనముగఁ జేయు ముక్తిపి। ధానములం జెలఁగు
బర్వతస్థానంబుల్ ॥ శా॥భాతిన్ జెంది రహఃప్రదేశముల నప్పాతా

శగంగానది। ప్రాతస్స్నానపరాయణవ్రతమ్యగి పక్షీంద్రవృక్షాచల, ప్రా
తశ్శీకరశోభనాద్భుతపరిస్ఫారద్రుమప్రస్థలీ। పూతంబై విలసిల్లు శ్రీన
గమున్వైఁ బుణ్యాశ్రమశ్రేణికల్॥ (శా) రమ్యస్ఫాటికవర్ణంబు శ్రీగిరి
పవిత్రక్షేత్రధూళిచ్ఛటల్। కామ్యార్థంబులనిచ్చు దోషలతలన్ ఖండిం
చు లీలాగతిన్। సోమ్యాటోపనటన్మహానటజటాజూటాటవీకోటర
ఖ్యాతివ్యత్సింధుపయోజపాంసుపటలీపాటచ్చరప్రక్రియల్॥ (మ) క్రము
కాఖేస్సితదానలోలము మహాకల్యాణసంశీలముల్। భ్రమరానందక
జాలవాలము మునిప్రవ్యంతకృశీలముల్। శమిశాంకాహూద్భవజాల
ముల్ సుఖకరస్వచ్ఛంద్రనిశ్రేయస। ప్రమదాఖేలనముక్తియాలము మ
రుత్కాలంబ శ్రీశైలముల్॥ (క) శ్రీశైలము శ్రీశైలము। శ్రీశైలంబనెడు
పుణ్యశైలుని మదిలో। నాశైలజాధినాధుఁడు। శ్రీశైలనివాసుఁ డుండుఁ జే

—శ్రీగిరి చతుర్ద్వారనిర్ణయము-అందలి దేవతాతీర్థములమహిమము.—

తఃపీఠిన్॥ (క) రాజితపావనతీర్థసమాజప్రఖ్యాతజనిత మాహేశ్వ
రమా, రాజధరువకును శ్రీనగ। రాజాధీశునకును నుత్తరద్వార మగున్॥(క)
యోగములు భక్తిరసస। భోగములుఁ బురాణశాస్త్ర పుణ్యశ్రవణో।
ద్యోగముల జనులకును నను। రాగములన్ జెలఁగు నుత్తరస్థానంబుల్॥(వ)
అందులతీర్థంబులు మాహేశ్వరలింగస్థలంబులును ఉమాదేవియును శ
క్తియు రుద్రధారయుఁ బంచధారయు నక్షీణధారయు దేవధారయుఁ
బల్లవధారయు విష్ణుధారయు భైరవధారయు నింద్రధారయు మా
హేశ్వరంబును నీలేశ్వరంబును నవభైరవులు నవదుర్గాస్థానంబులునవ
నారసింహస్థలంబులు జంబుకేశ్వరంబును సంధ్యాతీర్థంబును గరుడే
శ్వరంబును గణేశ్వరంబును సమాధితీర్థంబును కాలహ్రదతీర్థంబును
దేవహ్రదంబును నిలహ్రదంబును నగ్నీశ్వరంబును గన్యాతీర్థంబును
మరేశ్వరంబును నమరావతీతీర్థంబును యమునేశ్వరంబును జషుమార్ఖ
నందీశ్వరంబును తీర్థంబును గోకర్ణమహేశ్వరంబును పాపవినాశంబు

ను సుమహాశైలంబును సూర్యేశ్వరంబును భీమేశ్వరంబును దిలపిష్టేశ్వరంబును హేమశైలంబును రుద్రకోటీశ్వరంబును మొదలైన పుణ్యతీర్థంబులనంతంబులు గలవు తత్తీర్థంబుల నవగాహంబుచేసి యాయాతీర్థంబుల శివలింగదర్శనంబు సేయు మానవులకు నశ్వమేధసహస్రంబును వాజపేయశతంబును జేయునట్టి ఫలంబుసిద్ధించు వెండియు॥ (క) వందారు దేవతాముని।సందోహము లబ్బురంబు శాశ్వతసదనం। బిందుధరునకును శ్రీనగ। మందిరనిలయునకుఁ బశ్చిమద్వారమగున్॥ (క) బ్రహ్మేశ్వరలింగంబును। జిహ్మగభూషణుని భక్తిసేవింపఁబర।బ్రహ్మజ్ఞానము గలుగును। బ్రహ్మస్త్రీగోవధాదిపాపము లణఁగున్॥ (వ) అందుల తీర్థంబులు తుంగభద్రాతీర్థంబును యోగితీర్థంబును వేదవతీతీర్థంబును నాదవతియు మణికర్ణికేశ్వరంబును రామేశ్వరంబును నమరేశ్వరంబును యమునేశ్వరంబును గణేశ్వరంబును ముక్తిరామేశ్వరంబును భోగేశ్వరంబును వరుణేశ్వరంబును లక్ష్మణేశ్వరంబును నెత్తడిరామేశ్వరంబును మణిభద్రేశ్వరంబును సప్తమునీశ్వరంబును గుప్తమాహేశ్వరంబును గుప్తమల్లికార్జునంబును నింద్రేశ్వరంబును సిద్ధేశ్వరంబును మొదలైన పుణ్యతీర్థంబుల నవగాహంబుఁజేసి యాయాయితీర్థంబుల శివలింగదర్శనంబుఁజేయుమానవులకు నశ్వమేధసహస్రంబును వాజపేయశతంబును జేయుఫలంబు సిద్ధించు వెండియు॥ (క) తోయజభవసురపతినారాయణముఖదేవతాభిం తి సిద్ధవటం । బాయతమహిమము శ్రీగిరి। నాయకపురమునకు దక్షిణద్వారమగున్॥ క॥ సిద్ధవటేశ్వరుఁ గామిత। సిద్ధిప్రదు దర్శనంబుఁ జేసినముక్తుల్। సిద్ధించుఁగ్రీడసల్పును। సిద్ధామరకిన్నరేంద్రసేవాన్వితుఁడై॥ వ॥ అందులతీర్థంబులు సిద్ధేశ్వరంబును నష్టమహాసిద్ధియును శక్తియు జ్యోతియు నిష్టకామేశ్వరంబును భృగుపాద తీర్థంబును వరుణేశ్వరంబును బుష్పగిరియును గుముద్వతీతీర్థంబును గన్యాతీర్థంబును రామేశ్వరంబును ధర్మకూలోత్తరంబను నదియును బ్రాణేశ్వరంబును మోక్షేశ్వరంబును గపిలేశ్వరంబును సాలంకయు మత్స్య

లంకేయు నందిమండలతీర్థంబును బ్రమథనందియు నాగనందియు శివ నందియు కృష్ణనందియు మహానందియు గరుడనందియు నాయకనంది యు దివాకరనందియు సోమనందియు బ్రహ్మనందియు నోంకారేశ్వరం బును నహోబిలంబును శంకరేశ్వరంబును బాపవినాశనంబునుదూర్వా సుతీర్థంబును రుద్రకోటితీర్థంబును మొదలైన పుణ్యతీర్థంబుల నంతం బులుగలవు తత్తీర్థంబులనవగాహంబుఁజేసి యాయాతీర్థంబుల శి వలింగదర్శనంబుఁ జేయు మానవులకు నశ్వమేధసహస్రంబును వాజపే యశతంబునుం జేసినఫలంబుగలుగు వెండియు॥ క॥ స్వారాజదివిజసే వ్యము। పారావారాంతభూమిపావనభూభృత్సారము శ్రీనగపూర్వ। ద్వారము త్రిపురాంతకంబు వశమె నుతింపన్॥ క ॥ త్రిపురాంతకు దర్శించిన। నపరిమితాశేషపాతకాదులు వొలఁగున్। విపులశుభంబులు పొందును। నపవర్గసుఖానురాగ మప్పుడె కలుగున్॥ వచనము॥ మల్లతీ ర్థంబునుగంధవతియును ద్రిపురాదేవియునుశక్తియుధూర్జటీశ్వరంబును బృథుశైలంబునును త్రిరేశ్వరంబును కన్యాసిద్ధేశ్వరంబును గౌరీశ్వరంబును సప్తకోటీశ్వరంబును మండూకేశ్వరంబును గుంకిప్రభాతీర్థంబును స హస్రరామేశ్వరంబును లింగతీర్థంబును సంగమేశ్వరంబును కపిలేశ్వ రంబును స్కందసోమేశ్వరంబును బరశురామేశ్వరంబును భీమరేశ్వ రంబును మణికర్ణికేశ్వరంబును ముక్తీశ్వరంబును దులాసిద్ధేశ్వరంబును శ్రీకంఠేశ్వరంబును రుద్రాక్షశైలంబును విభూతినగరంబును వమేశ్వ రంబును పునర్వేశ్వరంబును గంధర్వతీర్థంబును మోక్షకుండంబును మొదలైన పుణ్యతీర్థంబు లనంతంబులు గలవు తత్తీర్థంబులఁ గృత స్నానులై యాయాయితీర్థంబుల శివలింగదర్శనంబులు చేయు మా నవులకు నశ్వమేధసహస్రంబులు వాజపేయశతంబులు చేసిన ఫలంబు లు సిద్ధించు వెండియు న్నల వనిన వేదవ్యాసుండు తరువాతి కథావిధా నం బెట్టిదనిన నమ్మునీశ్వరునకు సనత్కుమారుం డిట్లనియె॥

ఆశ్వాసాంతము.

క॥కాంచనగర్భామరవర।కాంచనకోటీరవణిగద్ధిగితపదా।

పంచాక్షరఫలకల్పక। పంచాస్త్రతమఃపతంగ పర్వతలింగా॥ మాలిని॥ దివిజరిపువిపక్షా దేవతానీకపక్షా। వివిధఫలదవీక్షా విశ్వరక్షైకదక్షా। భవదురితవిభంగా భక్తచిత్తాబ్జభృంగా। భువనసధిషంగా భూధరాధీశలింగా॥ శా॥అభ్రద్వీపవతీమహాలహరిసద్యగ్ధాతవిద్యుత్ప్రభా। విభ్రద్భ్రూభ్రజటాటవీకుటజలంబిస్థూలరేఖాశిఖా। సిభ్రాభ్రభ్రసితాభ్రవర్ణసుమనస్స్నిగ్ధేందురేఖాధరా। మభ్రస్పర్శజగత్పవిత్రకరనామా పర్వతాధీశ్వరా॥

గద్యము॥ ఇది శ్రీమల్లికార్జున కృపాలబ్ధమేదురాష్ట్రభా
షావిశిష్టశివయోగగణవర్య శేషనాధార్య ప్రణీ
తంబైన శ్రీ పర్వతపురాణంబు నందు
దృతీయాశ్వాసము.
శ్రీసాంబసదాశివార్పణమస్తు.

---





శ్రీరస్తు.

శ్రీభ్రమరాంబాసమేత మల్లికార్జునస్వామినేనమః.

శ్రీపర్వతపురాణము - చతుర్థాశ్వాసము.



(క) శ్రీశైలపుణ్యమహిమము।లాశైలతనూజవినుచు నానందసు
ధా।రాశిరసకేళిఁ దేలుచు।నీశానునిఁజూచి త్రిభువనేశ్వరి పల్కెన్॥ (గీ)
విశ్వలోకేశ యింకనొకటి విన్నపంబు మల్లికార్జుననామమే మహిమఁ గ
లిగె, తెలియనానతిఁ గృపసేయు దేవదేవ॥ (వ) అనిన పరమేశ్వరుండి
ట్లనియె సతికి॥ (సీ) శ్రీపర్వతంబు వర్ణింపఁగాఁదగు ధరాజలజాక్షి
కర్ణభూషణము వోలెఁ గవిరాజదినకరకమలాసతీశ్వరధామమై మే
రుభూధరము వోలె। వివిధగంధర్వాదివిద్యాధరానీకసదనమై దేవతా
స్థలము వోలెఁ।గుందసీలాబ్జము కుందసందోహంబు పొందును ధననాథ
పురము వోలె। భవ్యహర్మ్యాగ్రభవనవిభ్రాజమాన। ఖచితమాణి
క్య పంకసంగతవిటంక।దేవతాగారమంటపోద్దీప్తశాల।కుంభకుంభావ
శము చంద్రగుప్తపురము॥ (సీ) కలుగవాజనులందుఁ గాఠిన్యగుణములు
ముదితల వక్షోజములనె కాని। వక్రగుణంబులెవ్వారియందును లేవు కుటి
లాళి వేణుల కురులకాని।చంచలత్వంబు లేజనులయందును లేవు పుష్పకోప
ులచూపులనె కాని।జాడ్యంబులెవ్వరి జనులయందున లేవు నారీమణులగ
మనముల గాని। వేములప్పు జనులందు లేవు బెరసి।అలరుబోణుల చారు
మధ్యములఁ గాని।యిట్టి కల్యాణపదములకాలయంబు। పుడమి నీచంద్రగు
ప్తికేపురము సాటి॥ (క) పురినేలు ముక్తిభూమికి। సరియన నిజవారు
లునంద జనియింతురని। భవరభోగమోక్షములకై।చర జంతువులెల్ల
హేతుజన్మములనఘా॥ అప్పురాధీశ్వరుండు॥ (సీ) చేయించెనెవ్వాఁ
డు సేవితోర్వీశులరాజ్యంబు లక్ష్మీవిరాజితముగ।త్రవ్వించె నెవ్వాఁడుర్వ
దసర్వదిగ్గజస్తంభంబులను జయశాసనములు । మాయించె నెవ్వాఁడు

మార్తాండవిక్రమోద్ధతిజనాకించనధ్వాంతములను। కాయించె నెవ్వ
డుతరటకీర చంద్రికల్ చక్రవాళాంతభూచక్రమునను।నతఁడు జలరా
శిపరివేష్టిత ధావనిశ। రాజరాజీవషండమార్తాండమూర్తి। చంద్రచం
ద్రికాసంభృతచారుకీర్తి। గుప్తవంశోద్భవుఁడుచంద్రగుప్తనృపతి॥ (క)
ఆచంద్రగుప్తభూపుఁడు। ఆచంద్రస్థిరవధూటి యనిశముమదిలో।నాచం
ద్రికాముఖుఁడు దానుష।నాచంద్రకిరీటుఁ గొలుచు నచలితభక్తిన్॥ (క) వి
ద్యుత్కాంతుల డాలును।ఖద్యోతప్రభలుగూర్చి కనకపునీటన్।హృద్యం
బగుములు గడుసును జోద్యంబుగఁజేసె నబ్జసూనుండింతిన్॥ (క) వల
రాజు రాణివాసము।తలిరాకున్ బోణిచక్రుఁదనమును నోఅవున్। గిలు
కుండి యొప్పులన్నియు। నిలిపి ప్రపంచమును ననజుఁడు నెలతుకఁజేసెన్॥
(క) చెలిపొలసు పలుకుమాటలు।పలుకకను మగమీలుకనుఁగవకు సరియా
గునే।వులికుట్టు మాటలేటికి। కలకంఠి కుచోపమములె కనకఘటంబుల్॥
(సీ) ఘనకాంతి మెలఁగెడు కనకంపుఁదీఁగెయో కాదుకంతుని భద్రగజ
ముగాని।కాంతయో కస్తూరికావర్ణరూపమో కాదునిజకర కంబుకంఠి
గాని। రాజాస్యరూపమో రత్నప్రదీపమో కాదు కాముని దేహకాం
తిగాని।చిరుసానఁబట్టిన చిత్తజుబాణమో బాణమె మన్మథత్రాణగాక।
కలరెసిరితమానవాంగనలు ధరణి ననుచుఁ బువుబోణులెల్లను నభినుతిం
పఁ। గంతుసామ్రాజ్యపట్టంబు గట్టఁదగిన।రమణివిలసిల్లె విభ్రమారంభ
ములను॥ (క) ఇలిచంద్రాబ్జంబులు మును। నిలిపినచే వణఁకుదీఱినేర్చిన
వాఁడై। యలసూనవిల్తు వింటికి।నలవరిచెన్ గమలసూతి యటుగా నో
పున్॥ (వ) అని నుతియింపుచు సఖీజనులు సరసాలాపంబులఁ గొలువ
నొకరునాఁడు॥ (గీ) పడఁతినానారసప్రాయభంగులందుఁ। ప్రౌఢరీ
తుల గీతముల్ వాడనృపతి।చూచెనంగభవుండు ప్రసూనశరము। వాఁడి
గావించి గుణించి వంకదీర్చె॥ (క) మోహించి నజనకవ్యా।మోహం
బతిదురితకరమణమాలంబని తా।నూహించి మగుడితనగృహ। దేహళి దే
శమునని లిచె తెలివలు దానున్॥ (వ) అకడ సఖీజనంబులఁజూచిచం

ద్రవతీకన్యం ట్లనియె॥ (క) మదనుండు పాపకర్ముండు। మొదలన దర్ప కుండు గానమూర్ఖుండు గాఁడే మదనారిని డెందంబున। పదిలంబుగ నిలిపి తండ్రికి గసాధింతుఁ॥(క)నిగనిగ మేరల వేఁడిమి। జగిదొలకెడుతనమున యె ఱ్ఱచి స్ఫురకంటఁ। జిగురుఁగ్రై దువజోడును। దెసఁజూచినధీరు దేవదేవుఁ గొలుతుఁ॥(వ)అనినసఖీజనులిట్లని॥(క)సరియట్టకానచిత్తము।సరిలేక దె గగూడ దెల్లసంయమికైనఁ వర రాజ్యభోగసంగతి।మరగనచిత్తంబు శివు నిమరు గఁగవశమె॥(క)ఇట్టిసదాచారిస్వము।నిట్టిదృఢవ్రతము గలదెయి త రుల కెల్లఁ।గట్టిగ శివుకృపగలిగిన। నెట్టన శరణులకుఁ గాకనిలుకడగల దే॥ (క)పలుకులు శివమంత్రంబులు।తలఁపులు శివభక్తితత్త్వతత్పరలీలల్।నిలుక డ సన్మార్గము ఈ। చెలువకు హృదయాంబుజంబు శివనిలయ మగుఁ॥ (క) పసిఁడికిఁగమ్మని వాసన। ప్రసవము మలయజము నకును ఫలమియు నకుఁ।ప్రసవించినచందంబున వసుమతి జనియించి తమ్మనజదళాక్షీ॥ (క) గౌరీవల్లభువలనఁ। గారుణ్యమువడయు కంబుకంధర యానుచుఁ। నీరేజముఖులు దీవెన। లారాజతనూజ కొసఁగిరధిక ప్రీతిఁ॥ (గీ) సఖు లు బోధించి తెలుప నిశ్చలవిరక్తి।శివుని డెందంబునెత్తమ్మసీమనిల్పి।కాం తలను గీతిఁ జేసెయ నేకాంతమునను। పద్మలోచన యిట్లని స్తుతించె॥

(రగడ.)

శ్రీమత్పర్వతశిఖరవిశాలస్థిరపీఠము పర్వతలింగము । సామబయోగశ్రీ

—(*) చంద్రవతి పర్వతేశ్వరుం బ్రస్తుతించుట. (*)—

జుమఁఖనిఖిలశ్రుతిసన్నుతపారము పర్వతలింగము । హైమవతీముఖ చంద్రచంద్రికాహ్లాదచకోరము పర్వతలింగము।సామజదానవచర్మప టీప్రశాలకపీఠము పర్వతలింగము । రమణీయత్రిదశాలయాతిజనరత్న సాను వీపర్వతలింగము । కమనీయాశ్రితవిశ్రాణనగుణ కామధేనువీప ర్వతలింగము।షడ్విధభక్తిస్థలసంపూజితసత్యశ్లోకము పర్వతలింగము। షడ్విధపత్రాంచితమంత్రాంబుజచంచరీక మీపర్వతలింగము । అత్రాం

తాశ్రితసంరక్షణసంయుతచింతామణి పర్వతలింగము। నిశ్శ్రేయసపదని
రతమునిశ్రేణీరక్షామణి పర్వతలింగము। కామితపుణ్యఫలప్రతిపాదనక
ల్పవృక్షమీపర్వతలింగము। వామదేవమునిముఖ్యానవరత వరదకటా
క్షము పర్వతలింగము। స్వర్గనదీజలసంక్షాళితపల్లవసన్నిభజూట
ము పర్వతలింగము। వర్ణితమధుర సుధాకరరేఖావహనకిరీటము ప
ర్వతలింగము। బ్రహ్మమునీశప్రచురభవాబ్ధిప్రకటితహేతువు పర్వత
లింగము।బ్రహ్మాండప్రకరప్రభవాసవభంజనహేతువు పర్వతలింగము।
పంకరుహప్రభవాండమాలికాభరణోపేతము పర్వతలింగము। పంక
జాక్షనందనపారాశరప్రకరఖ్యాతము పర్వతలింగము। దారుణభూ
రిభవాబ్ధిమగ్నసంతరణవహిత్రము పర్వతలింగము। పీఠవిశ్రుతత్రిపుర
పురత్రయణపీఠిహిమాద్రి మీపర్వతలింగము। భ్రమరాపంకేరుహదళనే
త్రీపాణిగ్రహణము పర్వతలింగము। సమధికనిఖిలలోకతపోధనసద
నుగ్రహణము పర్వతలింగము। బ్రహ్మేంద్రాదిత్రిదివౌకఃపశుపాలన
దక్షము పర్వతలింగము। జిహ్మగపరివృఢదివ్యభూషణశ్రీకరవక్షము
పర్వతలింగము। సేవాగతసురమస్తకమణిఘృష్టిదీపకము పర్వతలిం
గము। భావుకచిత్ప్రద్యోతమానసుఖపరమరూపకము పర్వతలింగ
ము। నిఖిలశ్రుతిశాఖాశిఖరనిత్యశ్లాఘము పర్వతలింగము। అఖి
లమహాపాతకసముదయపరిహరణగుణౌఘము పర్వతలింగము। అన
వరతానందామిత వరమాత్మాభిధానకము పర్వతలింగము। అనుప
మనిత్యసుఖాపవర్గఫలదావధానకము పర్వతలింగము। సర్వజగ
న్నుతకైవల్యప్రతజనతారాధ్యము పర్వతలింగము। నిర్వచనీయవిశా
లభక్తవరసుజనసాన్నిధ్యము పర్వతలింగము। నతశతమఖముఖవిజ్ఞ
ప్తాంబుధినామధేయ మీపర్వతలింగము। ప్రతిభాంచితమునిజనశ్రిత
భాగధేయకము పర్వతలింగము। ప్రస్తుతసచ్ఛలభక్తపురాతనపటుభూ
ధరము పర్వతలింగము। శత్రుప్రవర్తితత్పరజనకదుర్గాజలపయోధరము
పర్వతలింగము। శివపదసద్రత్ననిత్యమారాధనచిత్తశోధకము పర్వతలిం

గము । ప్రవిమలధర్మజ్ఞానపరాయణభక్తిబోధకము పర్వతలింగము । ముఖ్యచతుర్దశభువననికేతనమూలస్తంభము పర్వతలింగము । విఖ్యాతనానాలోకజనపూజావిధవిస్రంభము పర్వతలింగము । రంజితభక్తజనానురాగనవరసవికస్వరము పర్వతలింగము । భ్రాజితపరమబ్రహ్మవిగ్రహవిభావభాస్వరము పర్వతలింగము। శిష్టాచారవిచారవివేకవిశేషనిర్భరము పర్వతలింగము । దుష్టేంద్రియసంచారప్రకటితదురితదుర్భరము పర్వతలింగము । అసదృశకీర్తిప్రతిభాభ్రాజితబ్రహ్మాండకరండము పర్వతలింగము । అసమశరాసనగర్వతిమిరసంహతిమార్తాండము పర్వతలింగము । దండధరఖండితప్రచండకిరదండఖండనము పర్వతలింగము। చండకిరణమండలకాండాయుతసదృశమండలము పర్వతలింగము । నిజదేహాంబుధిసంజనితనిఖిలజగన్నిచయాతురంగము పర్వతలింగము। భజనపరాయణసన్మునిచేతఃపంకజభృంగము పర్వతలింగము । మహితత్రిభువనమండితచతురామ్నాయతురంగము పర్వతలింగము । బహుళవిక్రమక్రమవిశ్రుతకరపద్మకురంగము పర్వతలింగము । సర్వలోకహితకారణభాసురచంద్రరథాంగము పర్వతలింగము । అర్వాచీనపదోదంచితనిత్యానందాంగము పర్వతలింగము । గర్వహీనశివభక్తియోగరతకరుణాపాంగము పర్వతలింగము । రమ్యాశంసితరూపవిలాసకురంగసురాంగము పర్వతలింగము । వేదాంతోపనిషన్మృదుభాషణవినుతభుజంగము పర్వతలింగము । మేదురబలగజదానవకంజామితమాతంగము పర్వతలింగము । వినుతసురాంభోరుహసరిభవదర్వీకరతల్పము పర్వతలింగము। అనుపమపర్వతపుత్రీకుచపత్రాళిశిల్పకము పర్వతలింగము। సామప్రముఖశ్రుతిచరణోన్నతసరసపాఠము పర్వతలింగము । కామికముఖ్యాఖిలదివ్యాగమకథనవ్యాఖ్యము పర్వతలింగము। సజ్జనరక్షణసంప్రీతికోదనసదనుగ్రహణము పర్వతలింగము। గర్వదుగ్రనిర్ఘృణకంఠీరవకటునిగ్రహణము పర్వతలింగము। పరశుతీవ్రధారాజలశాంభవిపక్షపరాగము పర్వతలింగము । నిరుపమజహ్నుజ

జహల్లక్షణగుణాసిపుణీరాగము పర్వతలింగము । ఏకాదశమంత్రాదిప్రల్లవదక్షైకశరణ్యము పర్వతలింగము । ఏకాశీతిపదాతీతబ్రహ్మైకశరణ్యము పర్వతలింగము। సంచిత పంచాశద్వర్ణస్వరసారస్తుత్యము పర్వతలింగము। పంచప్రణవస్ఫుటబీజాక్షరభజనౌచిత్యము పర్వతలింగము। శబరబిల్వపత్రారాధనమోక్షప్రదాయకము పర్వతలింగము। ప్రబలశత్రుత్రయపాశఖండనపరిపాలనాయకము పర్వతలింగము। జూటస్థితసుమనస్తటినీశుభశుభ్రరాజితము పర్వతలింగము । కైటభదనుజప్రతిభటహాటకగర్భపూజితము పర్వతలింగము। భూరిభూతిప్రస్ఫురితశుభప్రదభువనపావనము పర్వతలింగము । పారిజాతవిఖ్యాతాశ్రితభజనభవ్యజీవనము పర్వతలింగము । సేవితమునిగీర్వాణశ్రేణీచిరకరుణానిధిపర్వతలింగము । భావితచేపికహాటకగర్భవిభాసితసేవధి పర్వతలింగము। స్వానుభావసాధనచతుష్టయస్వాంతనివాసము పర్వతలింగము। ధ్యానధారణస్థిరమానసశుద్ధాంతవిలాసము పర్వతలింగము । శమదమాదిషడ్విధసంపత్తివ్రజనపర్వతము పర్వతలింగము । భ్రమితమోహమాయామితపాశప్రబలబంధురము పర్వతలింగము । శిఖరముఁ జూచిన నరులకు నధికశ్రేయము లొసఁగును పర్వతలింగము।శిఖరముఁ జూచిన నతులితము కీర్తి లొసరించును పర్వతలింగము॥

క॥ శైలము నెక్కిఁడ నోపరు।హాలాహల మాన వేరు ఆవేల్ప లనే। నేలాభ జిఱుంచెద నన్నేలిన దేవుండు జగము వేలుచు నుండున్॥ అని స్తుతియించి మఱియు నిట్లనియె॥(సీ)దర్పకు గెల్చినంతటి యోగివయ్యును గిరిజాధినాథభోగియును నీవ।అసురులగెల్చి దివ్యాస్త్రపాణివి యయ్యు ధర్మంబు నడపెడు తపసి వీవ। భిక్షాటనక్రియాభిజ్ఞాని వయ్యును పరమేశ భువనాధిపతివి నీవ। బ్రహ్మాకపాలసంభరణుండ వయ్యును సేవ్యుండ వగు సదాశివుఁడ వీవ।పావకేక్షణ ఫణిరాజఫాలచంద్ర। భసితమందాకినీనదీస్పదపవర్గ । యుతుఁడవయ్యును నపవర్గ మొసఁగు నట్టి।పరమహాత్మ్యంబు లభవ యెవ్వరికిఁ జెల్లు॥(సీ)వెన్నుఁడు వలచి యే

విశ్వేశ్వరుని పాదకమలంబు మీఁదను గన్నవైచె।బ్రహ్మసంభాషణనంత
పద్మభవు నే దేవుండు ప్రత్యక్షకపాలపరీక్ష గొనియె।నిందుమిలాఁటిను దిట్టె
సినఁ దెరల్కె దేవుండు మాధ్యమదృష్టిఁ జూచె।కలశాబ్ధి తోఁబుట్టు వెన్న కడి
భుజియించియే శంభుండు నిత్యుఁడై జగము నిలిపె। నట్టి శ్రీమన్మహాదే
వుఁ డఖిలదిగ్జవంద్యుఁడును దేవతాచక్రవర్తియైన। చెల్లుబడి నిట్టి మ
హిమలు చెల్లుఁ గాక।వనజగర్భాదిసురల కెవ్వాకిఁ జెల్లు॥(శా) కర్ణా
లంకృతకుండలీశ్వరవియద్గంగాతరంగావళీ। పూర్ణార్ధేందుకళాకలాప
విలసత్కోటీరపాటీరవా। స్వర్ణాడంబరదివ్యదేహ యనినా వాక్కా
యకర్మంబులన్। వర్ణింతున్ నుతియింతు నిన్ను శివ దేవా దైవచూడా
మణీ॥(గీ)ఇట్లు వినుతింప సర్వేశుఁ డింతి మదిని। నీలకుంతలి నేఁగరుణిం
తు ముక్తి బరిణమించితి నీదృఢభక్తి కనుచు।పలికి నల్లైన పద్మాక్షి ప్ర
మదమందె॥(గీ)దర్పకారాతి మది నిల్పి తలిరుబోణి।సుదతు లెల్లను గొ
లువ నచ్చోటు వాసి।శంభుపూజార్థమై పుష్పసమితిఁ గోయ।నతివ శృం
గారపూఁదోట కరుగు నంత॥(గీ)మదను పంపునఁ జైత్రాగమం బెలర్ప।

—(*) చంద్రవతీకన్య పూఁదోఁట కరుగుట. (*)—

నొలసి వనపఙ్క్తి భామిని మెరలు వదలి।లీలఁ రాలు కపోలవల్లీవితానర
మణ దీపింపఁ దరుల కారాకు వెడలె॥(క)ననవిలుతు మచ్చికపు మన్నన
చే సొంపారి పొదలి నవక మెలర్పన్।వనసిజు పెక్కైములోయన।ననిచెన్
వల్లరుల కొన్ననలు సొంపారన్॥ (చ) కలకలకంఠభాషలు విక
స్వరమత్తగజేంద్రయానముల్। కలితలతాతనూరమణ గాఢమధువ్రత

—(*) వసంతఋతువర్ణనము. (*)—

కుంతలంబులున్।విలసితచక్రవాకకుచవిభ్రమముల్ దలకొత్తచైత్రునిన్।
గలసిసుమాళి మెండె నవకానన పఙ్క్తివిలాసినీగతిన్॥ (సీ) కామించి
వనపఙ్క్తికమలాక్షి పులకించి క్రొత్తమోసులుసాంగ విస్తరించి। బాలశు
కోత్తమబ్రహ్మచారులకును శిక్షించి చదువు రాఁజెప్పిచెప్పి। శోభితనవల

శాశుద్ధాంతకాంతల కమ్మనిపూవిచ్చి కలసికలసి। కోమరుఁద్రావాయంబు
లేఁ గొదమతుమ్మెదలును చెలువమైఁబూదేనె చిలికిచిలికి। బలసివెండ
కుదళవాయి పట్టుమొసఁగి।చనవు కృపజేసి యత్యంతసమ్మదమున।నఱరు
తరువులు మగుడఁద్రావాయంబువడసి। యించువిల్తునిసామ్రాజ్య మొసఁగ
జేసి॥ (సీ) బాలాళినివహంబు బాలాళిభంగి నిలతలమైనిల్చి యారతు
లుసేయు। కోటులజస్వనుల్ గూడికుహూకారకాహాళధ్వనులు చాకఱము
గఁబూన। రాయించ లేమలు రహిసిల్వఁబాగడంగ రాఁజిలుక జవరాలు
రామనంగ। మలయానిలుండును మందమార్గంబున నలతాళికునిభంగి
నటనఁజూప। సంభ్రమంబున మంజరీస్తనము లూరయ।వైభవంబునఁగర
పల్లవములుసాఁచి। తరులతాంగనచెలఁగి నర్తనము సలుప।యంతకం
తకువనలక్ష్మి యతిశయిల్లె॥ (వ) మఱియుఁ దత్కాలంబున మేలంబు
లక్ క్రీడావాలంబులక్ బిసజాలంబులక్ దెచ్చి ప్రియులకిచ్చు మచ్చికలక్
జెచ్చు లెరుగుచు నిర్వక్రవాకంబులగు చక్రవాకంబులును సహకారపల్ల
వంబులుల్లంబారమేసి క్రొవ్వువనఖ్వాల సరసంబులకు మధురంబులానియు
లు మావిమోకలమూకలై పూరేకుల మీఁదఁబోకలంబోవుచుఁ బ్రాణే
శ్వరులతోడఁ గ్రీడించు రాచిలుక రాణివాసంబులును మందారకుందకం
దళసందోహ మాకంద నిష్యందమానమకరందంబులందంద గ్రోలి డెందం
బానందంబునక్ బొందజిందువందాడు నిందిందిరంబులును మెత్తనిపుష్ప
గుత్తుల నెత్తావియువ్వెత్తునక్ గ్రోలి మొత్తముమత్తిల్లిచిత్తరింపుచు చి
త్తంబులిగురొత్త నృత్తంబుసలుపు మత్తకోకిలకోలాహలంబునగుచు న
త్యంతవినోదంబులగుచుండ మఱియును॥ (సీ) నళినాస్త్రమురళికానా
దమోయనమించు కలకంఠమృదుకుహూకారరవము। కందర్పవిభాళి
కాహాళధ్వనులను చనుచంచరీకసంచారరవంబు। కుసుమసాయకుఁడుం
డుగొల్లెనలోయనఁ బ్రభవించు కింశుకప్రసవతతులు।జలజసాయకుని చి
చ్చెరకోలలోయన విలసిల్లు సంపెఁగవిరుల పెంపు। కంతుసామ్రాజ్యప
టంబు గజములనఁగ।నంతకంతకుఁ జెలఁగి రాయంచగములు। చిత్తజన్మ

నిసామ్రాశితేజు లనఁగఁ। జెంగలింపఁ జుంబలికె రాఁజిలుకగములు॥ (గీ) అంతశృంగారపూఁదోట కరుగుదెంచి। వనముసొంపును సఖులజవ్వనముసొంపు।వి హ్య మండంగవనకేళివిశ్రమించి। ప్రౌఢకామినులిట్లని పలి

(*)చంద్రవతీకన్యసఖులుందానును శివపూజార్థముపూలుగోయుట.(*)

కెరంత॥ (సీ) మాధవీనవపుష్పమంజరిఁజూచితే యభిరామనవకలహంసయానా। యభిరామనవకలహంసాళిఁజూచితే ఖేలాభినవరాజ కీరవాణి। ఖేలాభినవరాజకీరాళిఁజూచితే నీలకంఠకలాపనిభశిరోజ। నీలకంఠకలాపనిచయంబుఁజూచితే కలమృదుస్వరకలకంఠనాద। కలమృదుస్వరకలకంఠంబుఁజూచితే నిబిడకోమలాళినీలవేణి। నిబిడకోమలాళినికరంబుఁజూచితే యనుచుఁ గ్రీడసల్పి రతివలెంత॥ (క) విమలోదకప్రపూరము। శమితేంద్రియసంఘమింక జలశిమిశ్రము సు।ద్గమపుణ్యఫలదనీరము। కమలోత్పలపుష్పగంధికాసారంబున్॥ (గీ) చేరియందఱు నత్యంతచిత్తశుద్ధి। తత్పరత్వంబుచను కృతస్నానులగుచు। శంభుపూజార్థమైపుష్పసమితిఁగోయ। నవసరంబున నొకతెయిట్లనుచుఁబలికె॥ (క) భూతేశుపూలఁబూన్పెడు। జాతులనఘములను నగ్రజాతిప్రముఖ।ఖ్యాతులను జేయునానా। జాతిప్రసవములుగోయు జలజాతముఖీ॥ (క) విరిలోఁగించిద్దళమునఁ।బరమేశ్వరుఁ బూన్పనింద్రపట్టంబొసఁగున్। వరశక్తిసంపదలుగల। కరవీరములివియు కోయుకంజాతముఖీ॥ (క) ఉడిగిన తావులపువ్వులు।గడిబోయిన పుష్పములును కందినవిరులున్।తొడిమెలబాసినపుష్పాలు। పడతీ పూజింపరాదు పర్యుషితంబుల్॥ (క) రాజప్రసూనములచే। రాజార్ధకిరీటు భక్తిరతిఁబూజింపన్। రాజగునుముక్తివసుధకు। రాజిత రాజాధిరాజరసికోత్తముఁడై॥ (క) శతపత్రంబులఁబూన్చిన।శతపత్రప్రమథసకలసంఘమిదివిష। చ్ఛతమన్యులువినుతింపఁగ। శతరుద్రప్రమథసదృశసామర్థ్యుఁడగున్॥ (క) వాలినదుర్భవపాతక।జాలముఁదూలించిపుణ్యసంపదలొసఁగున్। జాలినమహిమల నెకుండు। నీ

లోత్పలపుష్పజాతి నివహములోనన్॥ (క) పసడించక నెరిగుందక। క
సుగందకకరుకు గాక కదుఛిద్రము గా। కనలారు బిల్వదళములు। ననమా
త్మునిఁ బూన్పఁగలుగు నపవర్గంబున్॥ (క) విలసదపామార్గ శ్రీ తు
లసీబిల్వములనరుఁడు ధూర్జటిఁబూన్పన్।గలుగును ద్వాదశలక్షలు కల
ధౌతప్రసవపూలికార్పణఫలముల్॥ (క) అలరులఁబూజలకంటెను।మ
లహారునకుఁబ్రియము పుష్పము లేకఁ బూన్పన్।గలుగును నధిక శుభంబు
లు।అలరులఫలములకు శతగుణాధికమగుటన్॥ (క) పన్నగధరుఁ బూ
జించిన।సన్నవపుష్పముల ఫలములంమట యరుసే।యెన్నఁగు రీకఁజోద్య
ముల।చ్ఛిన్నదళంబులభజించుఁజిత్రము గాదే॥(క)సకలప్రసూనములలో।
ముకుళీకృతచంపకాబ్జములు నవి దక్కన్। వికసితపుష్పము లహామ।
ముకుళంబులఁజూచి గాదు ముఖ్యము జగతిన్॥(క) పత్రములలోననవిశత।
పత్రోత్పలకనకబృహతిపత్రము లైదున్।ధాత్రి నిషిద్ధము లేకఁగల।పత్ర
ములన్నియును జెల్లు భవుఁబూజింపన్॥ (క) అభినవమును గోమలము
నుప్రభగలిగిన సకలపత్రపుష్పము లెల్లన్ । శుభవిభవంబుల నొసఁగు
ను । నభవునిఁ బూజింప యోగ్యమంచుఁ మహాత్మాల్ ॥ (సీ) ఈపు
ష్పములఁ గాదెయీశ్వరుఁ బూజించినమరుల సుతులఁగా నదితి గాం
చె । నీపుష్పములఁ గాదె యీశ్వరుఁబూజించి మనుజులు దేవత్వమ
హిమఁబొంది । రీపుష్పములఁగా దె యీశ్వరుఁ బూజించి సుందరిభృ
గుపత్ని శుక్రుఁబడసె । నీపుష్పములఁ గాదే యీశ్వరుఁబూజించి య
మృతాంశు బుత్రు గానత్రి వడసె । ననుచు నవ్వనవీధియందధికనియతి।
సకలలికచప్రసూనముల్ చాలగోసి। వేమ లన్నియు వేరె మాలికలు జే
సి । సరససల్లాపముఁ బలెకె జలజగంధి ॥ (క) రావే విలాసినీమ
ణి । రావే వనితాలలామ రావే రమణీ । రావే చకోరలోచన। రా
వే కలహంసగతుల రాజీవముఖీ॥ (సీ) చామంతు లివె తెమ్ము సీమంతి
నీమణి కమలాక్షి మహిసాక్షి గలుగఁ దెమ్ము। కంబులు పుండరీకంబులు
కడు నవకంబులై నవి దెమ్ము కంబుకంఠి । కోమలి గొజ్జంగి క్రొన్ననరు

కేవమ్మ పన్నీరు దేవమ్మ పద్మగంధి । పాటలగంధి దేపాటలఁబులు గంధసారంబు కే గంధసారగంధి । అభవు బూజకు వలయు ద్రవ్యంబు లెందు । నేమి గావింప వలయునో తెలియవలయు । వింతలైనవి వివరించి వెలఁది దెప్మ । అనుచు నియమించి చెప్పుచు నబ్జముఖులు॥ (సీ) బింబాధరంబులు బిట్టలు వాబుల్లఁ దాంబూలసౌఖ్యామృతంబు లాని । వదనాంబుజంబులు వాడకుండఁ మోవి యలరుటాకుల గుత్తు లానుకొనుచుఁ । జూతశాఖాదులు జొంపంబులై యున్న శీతలచ్ఛాయలఁ జేసి లిచి । కరపుటమ్ములను రక్తము లూర కుండంగఁ గరపయోజంబులఁ గటి ఘటించి । మెల్ల నేతెంచె బ్రౌఢకామినులు గొలువ । జితమనోభవు సైన్యవాంఛితవదాన్య । గానచైతన్య సవర్ణలోకైకమాన్య । సుదతి చంద్రవతీకన్య సుగుణధన్య ॥ (గీ) కిసలయంబులు కెంగేలఁ గిలుకొలిపి । మంచిపూదేనె చెమటచే మకరిళించిపువ్వగుత్తులు కుచములఁ బొందుపఱిచి । వెలఁది తనువల్లియల దీఁగవీడుపడఁగ॥ (వ) ఇవ్విధంబున విహారంబు సలిపి శృంగారపూఁదోట వెలువడి యేతెంచి కాంచికంత ॥ (సీ) శ్రీనగప్రోత్సంగశిఖరాగ్రసంసంగవేణికోత్తుంగ నవీనసంగ । యుభయతీరకుడుంగ యుక్తపవిత్రాంగ జలజాతభృంగ సంచరరథాంగ । ఘనమత్తమాతంగ కపియుగ్మభాగాంగ సంభృతమదభంగ సదనుషంగ । కలుషభుజంగ ప్రకరకరాళవిహంగ సంయ్యమివ్యాసంగ శమనరంగ । అనుదినాశ్రితనియతశుద్ధాంతరంగ । తటయుగాంతరజపితమంత్రప్రసంగ । సకలలోకైకనాథమస్తకవశంగ । తరళరంగత్తరంగపాతాళగంగ॥ (క) పాతాళగంగలోపల । నాతరుణులు తానమాడి రఘుములు వోలఁగ౯ । భూతేశనామపఠన। ప్రాతతపావనశరీరభాజను లగుచు౯॥ (వ) ఇవ్విధంబున

—* చంద్రవతీతీర్థంబులు దర్శించుచువానిం బ్రశంసించుట. *—

గంగాస్నానంబుఁ జేసి చంద్రవతీకన్య సఖీజనులతోడం గూడి తీర్థం

బులు దర్శించుచుఁ దీర్థప్రశంస సేయఁగ దొడంగె ॥ (శా) సిం
ధుసరస్వతీయమునగంగా ద్వారతీర్థావళితోఁ । బ్రాశతాటంచన జేవ
గేహములతోఁ బాతాళగంగాంబతో । నీశజ్ఞానసుధారసజ్ఞ శివయో
గీంద్రామరశ్రేణితో। శ్రీశైలాగ్రముఁ గాన వచ్చెనదిగో శ్రీపర్వతస్వా
మితోన్॥ (ఉ) కోమలిఁ జూచితే పసిడికుండలతోడి సువర్ణమందిరం।
బామహదేవు గోపురము లల్లవె కంటివె యానగంబు సోం। పే మహి
మంబు లీనదులు యన్నదరంబెనమశ్శివాయతీ । ధామమితిపుణ్యరాసి
శిఖరంబు గనుంగొన భాగ్య మబ్బెనే ॥ (చ) సుజనుఁడు శృంగమున్
గనిన చూపులు ముక్తిపురీకవాటముల్ । విజయవిలాసతన్ దెరచు వీక్ష
ణచాతురి యేమి చెప్పనీ । త్రిజగములందు నద్భుతము సృష్టికవాటవు
కుంచకోల యా । గజదనుజాంతకుండు కడగట్టిన కీటకతంత్రసూత్ర
మో॥ (మ) యమకోణంబును రుద్రపాదములు పుణ్యస్థానముల్ గంటి
వే । ప్రమథారత్నమ చంద్రగుప్తి నగమున్ ప్రత్యక్షకైలాస మా ।
ప్రమథుల్ దేవతలాదిమౌనివరులున్ బ్రచ్ఛన్నరూపంబుతోఁ । బ్రమ
థేశున్ భజియించు తావు లివియోపద్మాక్షి వీక్షించితే॥

(సీసమాలిక.)

శ్రీకోటిలింగాది చేళికాగహ్వరబ్రహ్మమాధవరుద్రపర్వతములు। భ
ర్గజూటీసింధుపావనప్రోత్తుంగ తరహోఘభంగపాతాళగంగ । నవ
గహ్వరోదగ్రనవసుధా కుండికాలీలాద్భుతము కదళీవనంబు । శం
కరునకు శోభనాంకంబు పాలంకసనియతనిరాతంక నిష్కళంక ।
యతులితాంభోజ గర్భాండ దివ్యౌషధికూటంబు శ్రీచంద్రగుప్తశిఖ
రి । యఘకర్మిణ గ్రుంక దేహమునఁ బంకము నించు హిమనిర్మ
లాంబు సర్వేశ్వరంబు । పాతకాత్ముల మీఁదఁ బడక యుల్లంఘించి
తొలఁగు పుష్కరతీర్థతోయధార। ముక్తివిలాసిని ముఖముకురఖ్యాతి
శాశ్వతోన్నతశిఖరేశ్వరంబు। స్వర్గాపవర్గాదిసారసౌఖ్యప్రదాత్రమ

ము కర్మాకేశ్వరస్థలంబు। కాంచనగర్భేంద్రకైటభప్రతిభటోపాస్యపా
రంగేశభవ్యమూర్తి। చంద్రదివాకరచక్రకుండక్షేత్రదివ్యఘంటాసిద్ధతీ
ర్థరాజి। చండపాతకతమఃఖండనపాండిత్యశాశ్వతోన్నతిహాటకేశ్వ
రంబు। ఫణిభువనాపగోద్భటశుభావిర్భావధికభృతిభోగవతీనదంబు।
బ్రహ్మలోకవ్యాప్తబహుళతీర్థశ్రేణిం దెగడు సరస్వతీతీర్థతటిని। మం
జులబ్రహ్మాండమహితతీర్థస్థలి గురుపుణ్యతతి మల్లె గుండసరసి। త్రిపుర
ఘస్మరశివత్రిదివాపగాపయఃపరిభావిగట్టికభావి మొదలు। పుణ్యతీర్థ
వ్రజంబుల పుట్టినిల్లు। తాపసశ్రేణికిని దపోధనగృహంబు। బహుళపుణ్యో
న్నతంబు శ్రీపర్వతంబు। శేషయోగీంద్రహృదయేశ శ్రీగిరీశ॥(వ)ఇవ్విధం

—(*) చంద్రవతి పర్వతలింగంబుఁ బూజించుట. (*)—

బునఁ దీర్థప్రశంస సేయుచు నేతెంచి పర్వతలింగభవనంబునకుఁ బ్రద
క్షిణంబు వచ్చి దండప్రణామంబుఁ జేసి సమ్ముఖంబున॥ (క)హాటకశైల
విహారుని। హాటకమందిరము నెదుర నను రాగమునన్। తాటంకినీలలామ
లు। ఆటలపాటలను గొలిచి రచలాధీశున్॥ (శా) అంభోజంబుల భావ
నాంభముల పూజారంభవిస్రంభతన్। శుంభల్లీలల హేమకంకణమణి
స్తోమప్రకాశచ్ఛటల్। జృంభింపన్ గడుఁ దోయజాతమునఁ బూజిం
చున్ బ్రయత్నంబునన్। శంభున్ జంద్రవతీవధూటి శివపంచబ్రహ్మమం
త్రంబులన్॥(క)కాలగళు గుడి గవాక్షాంతరాళనవిధులదశాంగధూపము
నిండన్। లాలాసురహారకంధరహాలాహలనీలకాంతి కనుసారణినై॥ (క)
కంతుహరు సమ్ముఖంబున। కాంతలు కర్పూరదీపకళిక లొనర్చన్। దంతి

—(*) చంద్రవతి పర్వతేశ్వరుని స్తుతించుట. (*)—

ముఖజనకజూటి। కాంతారసుధాంశుచంద్రికాప్రభ వొరయన్॥ (గీ)
ఎల్లపువ్వులఁ బూజించి యిందువదన। మల్లికాదామ మీశ్వరు మకుటవీధి।
నింపి పూజింప వేలుపు మేటిభాతి। ననుకరింపుచు నుండ నిట్లభినుతించె॥

(శా)శ్రీకంఠాయ నమోఽస్తు తే భగవతే సీతాంశుజూటాయ తే। త్రై
కంఠాత్తిసమర్పితాయ దివిషద్వంద్యాయ తే దేవతా। సీకాభీష్టఫలప్ర
దాయ కరణోన్మీలత్కిటాక్షాయ తే। లోకేశాయ నమోఽస్తు తే యను
చు నాలోకించుఁ బూజింపుచున్॥(శా) విద్యుత్కాంతిజటాకలాప యు
భవా విశ్వేశ నీపూజచే। సద్యోముక్తములౌ నఘంబులు మరుస్సంఘంబు
లేఁ బాయునే। ప్రద్యోతప్రబలప్రతాప మగు నాభానుప్రభన్ గాక
యా। ఖద్యోతద్యుతిచాయ నేర్చునెమ హాశర్వోర్వర ధ్వాంతముత్॥(మ)
కరిపోతంబు తదీయమాతృకుచ మాకాంక్షించుఁ గా కెట్లు। సూకరివ
క్షోజము చేర నాసపడునే కామారి నీపాదసం। స్మరణానందసుధార
సజ్ఞుఁడు నినున్ సంధించుఁ గా కన్యలోఁ। బరదైవాంతరమున్ గురిం
చి మదిలో భావించఁగా నేర్చునే॥(మ)హరి నీభక్తియు నీపదాబ్జభజ
నం బర్థించుఁ గా కెట్లు నీ। కరుణాపాంగసుధారసప్లుతశుభాకారక్రి
యాపేశలుం। డరుగన్ జూచునె యన్యమార్గణముల కాహ్లాదంబుతోఁ
దేటి। క్రొవ్విరితమ్మిన్ విహరించు బచ్చిలి విరుల్ వేమారు సేవించునే॥
(క)సరి గావు నీదు భక్తికిఁ। బరమతపోయజ్ఞవిధులు పదివేలైనన్। కరు
ణింపు నాకు శివ నీ। చరణాంబుజ భక్తి జన్మ జన్మము లందున్॥(వ) అ

—(❁)చంద్రవతి పర్వతేశ్వరుని యెదుట గానము చేయుట.(❁)—

ని యివ్విధంబున నభినుతించి గానవిద్యావిలాసంబున కభిముఖయై॥ (క)
ఏవేళన నేరాగము। లేవీణెలఁ గూర్చి పాడ నీశ్వరహిత మౌ। నావేళ
ల నారాగము। లావీణెలఁ గూర్చి పాడు నభినవగతులన్॥(వ)వీణోత్త
మంబు బ్రహ్మవీణ కైలాసవీణ సారంగవీణ కూర్మవీణ ఆకాశవీణ రా
వణవీణ గౌరీవీణ బాణవీణ కశ్యపవీణ స్వాయంభువీణ సరస్వతీవీణ భు
జంగవీణ కిన్నరవీణ లావణ్యవీణ జనకవీణ మనోహరవీణ గణనాథవీ
ణ కుమారవీణ కుంభికావీణ విపంచికావీణ రావణహస్తంబు స్వరవీణ
పరివాదినీవీణ యంభోజవీణ స్వరమండలంబు రుద్రవీణ మొదలైన వీణె

లు లక్షణోక్త ప్రమాణయోగతంతువులు కదియ గణికలు గూచికొ స్వరక్రమంబు లుల్లసిల్ల॥(క) కేవలసప్తస్వరముల। ద్వావింశతి శ్రుతులుగూర్చి తగరాయముల౯। గావుల మిశ్రధ్వనులను। నావనిత విలాసగతుల నాళవిసేయ౯॥(క) ఖురతాడనంబు విషమము। స్వరమంజరి దృఢసుభద్ర ఝంఝిరుదము సం। ధురచంచస్ఫుటముల। ధర నేకోత్తరశతంబు తాళము లొలయ౯॥(వ) మరియు శ్రీరాగం అందోళి లలితవిచిత్రాంగి సౌరరాగంబు శంకరాభరణంబు గాంధారి మధ్యమగాంధారి పంచమగాంధారి గుప్తగాంధారి గుప్తసాధారణము దేశికకుంభకంబు ధన్యాసికాంభోజి దేశాక్షి మధుకరి మేఘరంజి-వరాళి-తంగిణి-బహుళి-బంగాళి-మాహురి-బృహంతి-సౌరాష్ట్రి-సైంధవి-పడరంజరంబు-శుద్ధవరాళి-సింధువరాళి-కురువంజి-రామక్రియ-దేవక్రియ-గుండక్రియ-నాదరామక్రియ- మాళిగౌళ-ఛాయాగౌళ-కర్ణాటగౌళ-సౌరాష్ట్రిగౌళ-దేహగౌళ-కర్నాటవరాళి-భైరవి-వసంతము-ఏకచ్ఛవి. సావరి-కౌశిక-పూర్ణనాట- సారంగనాట- గుజ్జరి- సౌరాష్ట్రగుజ్జరి- ద్రావిళగుజ్జరి- మలహరి- మాళవ - భూపాళంబు- హిందోళంబు- తోంటితురక। తోంటిదివ్యవతి- దేశాపురి- చిత్రివేళాపురి- మధుమావతి- మాళవి- సిరియు- మొదలైన సారంగభాషాంగక్రియాంగసంజనితరాగంబునబడి నూటయెనిమిదింటియందు శ్రీపురుషరాగభేదంబులెంచింగి పాంచాలనాదమిశ్రకాపుళధ్వనిచతుష్టయంబుల తెలుంగును నాస్వరంబులు పుట్టుగాలంబులును బిధులునక్షత్రంబులుగ్రహంబులు యోగంబులజాతుల నెంచింగి ప్రథమతాళ- మిశ్రితాళ - శుద్ధతాళంబుబును - బదియేనుసారంగరాయంబులును. ముప్పదిరెండుశుద్ధరాయంబులును - ఆలు దెలుంగుల అళతిభేదంబులును ఇరువది రెండుగమకంబులును- ప్రత్యేకగమకంబులును - అష్టాదశవంశనాదంబులుల్లసిల్ల- గౌళ- వైదర్భి- పాంచాలరీతులను- మంద్రమధ్యతాళంబులును మానంబులు- దేశిమార్గంబుదీటుకొన దశప్రాణాను బంధంబులు సంపూర్ణంబులై యుండ గంబళాశ్వతరుల భంగాశ్వతతుల౯ దుంబురు

నారదాదుల మీఱ పాడుచున్నంత॥ (ఉ) సన్నుతపంచమస్వరము సం భవమై గగనంబు ముట్టగాఁ । దిన్నగ నాళవెంచి ర... ... న ... బడి నూట యెన్మిదై । యున్నతరాగభేదములఁ దల్లసిలంగను మూఁడు రీతులన్ । కిన్నరకంఠి శంకరుని గీతము లింపు వహింపఁబాడగన్॥ (ఉ) ఆలకించి తాంగి పాటవిని యైశ్వముఖాంగన లప్సరోంగనల్ । సోలుచు గానవిభ్రమముఁ జూచుచు నుండిరి పారవశ్యమున్ । జాల వహించి పొంగుచును జంద్రవతీనవగానచంద్రికా । జాలసుధానుభావపరిశాతచకోరవిహంగరాజిమై॥ (క) అంబరచరు లుల్లరుగక । యంబరమున నిలువ ఖగమృగావళియును మో । దంబున మేఁతలు మరువఁగఁ । దుంబురునారదులు ముదముతో వెఱఁగందన్॥ (మ) తరులున్ బణాలతాదులున్ బవనమున్ స్తంభింప నిపతింపతన్। గరఁగెన్ గండశిలాసమూహము శిలకంపంబు గావించెఁ జి । త్తరువుల్ జీవము లొందె నీరసతరుల్ తారుణ్యవిస్ఫూర్తిన్ సం । కురము ల్నిండ నిగిచెన్ జీవులకు సౌఖ్యోత్సాహముల్ చేకురన్॥ (గీ) జగతి మీఁదనుగల నీరసముల కెల్ల । జీవనము దెచ్చె గాన సంజీవకళలు । మూరిగానామృతము జగన్మోహనంబుఁ। జేసె సంపూర్ణమగు రసస్థితులవలన॥అంత॥

—* చంద్రవతికిఁబర్వతేశ్వరుండు బ్రత్యక్షమగుట. *—

(సీ) వింజామరంబుల విధములఁ జూపట్టు జడముడిపై బాలచంద్రకళలు । జడముడిపై బాలచంద్రమరీచులు నెలకొని నిండువెన్నెలలు గాయ । నిండు వెన్నెలలేట నిగ్గున వికసించు చదలేటి పూవ్వుదాలి సంభ్రమంబు । చదలేటి పూదాలి చవులగాపులుగ్రోవి పాపపెంజేము కళాప్రౌఢి మెఱయ । నెఱయనరసంజకెంజాయ యొఱపుదెగడు । వన్నె చారలతోలు దువ్వలువ మెఱయః । బ్రమథగణరాజితో సురప్రతతితోడ । నశివ ముందఱఁ బ్రత్యక్ష మయ్యె శివుఁడు॥ ఇట్లు ప్రత్యక్షుండై ॥ (గీ) కమలనేత్రిని గృపఁజూచి గారవించి । పరిణ

మించితి నీదృఢభక్తి మతికి । గానవిద్యా విలాసంబు కడు ఫలించె। వె లంది యెయ్యది యిష్టంబు వేఁడు మనిన॥ (వ) అమ్మహాదేవునకుఁ బు నఃప్రణామంబుఁ జేసి యానందకందళితహృదయారవిందయై యిట్లని ప్రస్తుతించె॥ ... ... ... ❀

❀ చంద్రవతి ప్రార్థనంబునఁ బర్వతేశ్వరుండు మల్లికార్జున లింగనామంబుఁ దాల్చుట. ❀

(సీ) శ్రీనీలకంఠాయ శీతాంశుజూటాయ మదనాంతకాయ నమశ్శివా య । కాలాగ్నిరుద్రాయ కాలసంహరణాయ మన్మనోజ్ఞాయ నమ శ్శివాయ । లాలాసురాంధకోల్లాసవిచ్ఛేదాయ మహిమాస్పదాయ న మశ్శివాయ । కమలసంభవశిరఃకరనీరజాతాయ మద్వల్లభాయ నమశ్శి వాయ । పార్వతీశాయ ప్రమథసంభాషణాయ । సకలలోకైకనా థాయ శంకరాయ । దివిజవంద్యాయ శర్వాయ తేనమోస్తు। అను చు వినుతించి పలికె నయ్యంబుజాక్షి ॥ (గీ) వరద నేఁబూన్చు నర్జునవ ర్ణమైన।మల్లికాదామ మెపుడు నీమౌళిఁ దాల్చి। మల్లికార్జునలింగ నామంబు నీవు। అవధరింపుము ఇదియ నాకభిమతంబు॥ (క) ఈమ ల్లికాప్రసూనపు।దామము గంగాపగాంబుధారణలీలన్।ప్రేమంబున ధరి యింపుము।కామాంతక తుహినధామకళయును బోలెన్॥(గీ)అనినఁ బ రమేశుఁ డవ్వరం బతివ కొసఁగి।అంబికానాథుఁ డానామ మవధరించె। నిఖిలకైవల్యసౌఖ్యంబు నెలఁత కొసఁగ। దేవసంయము లెల్ల నుతించి రంత॥(చ)తలిరుల మల్లికాప్రసవదామములన్ శివమంత్రయుక్తిగా।నలి కముతోడనే యకట నాఁడట కంతుఁ డనంగుఁ డయ్యె నీ। మలయజగం ధి నేఁడు శివమంత్రయుతంబుగ మల్లెపువ్వులన్। మలహరుఁ బూజచేసి యసమానమహత్త్వముఁ బొందెఁ గంటిరే॥(క) భక్తియె దురితవినాశ ని।భక్తియె సకలాపవర్గఫలసాధనమున్। భక్తికి సులభుఁడు శంభుఁ డు।భక్తికి సరిగావు క్రియలు పదివేలైనన్॥ (వ) అని దేవమునీంద్రులు

ప్రస్తాంప నవ్మహాదేవ్యం డంకధాాణనంబుఁ జేసె నంత॥ (గీ)తరుణి పూచ్చిన మల్లికా దామ మెపుడు। వకుటమందాకినీతటీమధ్యవీధి। నుసుప విలసిల్లెఁ జవలేటి సురువుబోలె।నాటగొని మల్లికార్జున నామ మవ్వ్య॥ (గీ)ఎన్ని దానంబు లవనిపై నెన్నఁబడును। నెన్నిధర్మణంబు లవనిపై నె న్నఁబడును।నవియు విధ్యుక్తముగఁ జేయు నట్టి ఫలము।కలుగు శ్రీగిరిలిం గంబు గాంచినంత॥(క)ఏనుఁడీ శ్రీగిరి మహిమలు।వినిన మనుష్యుండు వి నఁడు విక్రమనిష్ఠ వనయామలు లాయభీకర।ఘనగళఘంటాకఠోరఘణఘ ణరవముల్॥ (సీ) గోకర్ణగోకర్ణగోకర్ణసేవ్యంబు కౌశికకౌశికకౌశి కంబు। శ్రీధరశ్రీధరశ్రీధరావాసంబు కామదకామదకామదంబు। నిర్వా ణనిర్వాణనిర్వాణశుభదంబు భైరవభైరవభైరవంబు। గాంధర్వగాంధ ర్వగాంధర్వముఖశాలి శైలాది శైలాది శైలయుతము। అంజనాదృశ్య వినుతవిన్యాసనంద్య। సకలసంజీవనీవయాస్తంభశుంభ। కాయవరకా యభోగినీకాయసిద్ధి ఫలదమహిమోన్నతంబు శ్రీపర్వతంబు॥అనిన వేద వ్యాసుండు తరువాతి కథావిధానం బెట్టి దనిన సనత్కుమారుం డిట్లని యె॥(క)పంచబ్రహ్మమనుస్తుత। పంచాక్షరమంత్రపఠనఫలసురస్థాజా। పంచాంబరీషగవిణత।పంచశరోరగవిహంగ పర్వతలింగా॥(మాలిని) ప రమమహితచిత్రా భస్మసందిగ్ధగాత్రా। గుణశుభదచరిత్రా। కుంజరిత్వ క్కటిత్రా।దురితతృణలవిత్రా దుష్కృతధ్వాంతమిత్రా। భరితగుణపవి త్రా పద్మజస్తోత్రపాత్రా॥

గద్యము॥ఇది శ్రీమల్లికార్జునకృపాలబ్ధమేదురాష్ట్రభాషా
విశిష్ట శివయోగగుణవర్య శేషనాథార్య ప్రణీ
తంబయిన శ్రీపర్వతపురాణంబునందుఁ
జ తు ర్థా శ్వా స ము
సంపూర్ణము.





శ్రీరస్తు.

శ్రీభ్రమరాంబాసమేత మల్లికార్జునస్వామినే నమః.

శ్రీపర్వతపురాణము - పంచమాశ్వాసము.

శ్రీశైలపుణ్యమహిమము । లాశైలతనూజ వినుచు నానందసుధా। రాశిరసకేళిఁ దేలుచు। నీశానునిఁ జూచి త్రిభువనేశ్వరి పల్కెన్॥

శ్రీపర్వతంబునందలి మూఁడువృక్షంబుల మహిమ నభివర్ణించుట.

(గీ) శ్రీగిరిస్థలమధ్యమక్షేత్రమహిమ । లట్టి శ్రీగిరిశృంగత్రయంబు మహిమ|లందు విలసిల్లు వృక్షత్రయంబు విధము। తెలియ నానతిఁ గృపసేయు దేవదేవ॥ (వ) అనిన నమ్మహాదేవుం డంబికాదేవికిఁ గరుణార్ద్రహృదయుండై కటాక్షించి యిట్లనియె॥ (సీ) అమ్మూఁడు శృంగంబులందున ద్భుతసమారూఢిఁ వర్తించుఁ దరుత్రయంబు। తద్భూరుహంబులు దర్శించు నరులకు సర్వాభిమతములు సంభవించు। నొకమ్రాని మొదలును నొకట్రమానితుదయొక్కమ్రాని మధ్యము నంటు మానవులకు। ధారుణిస్వర్గపాతాళలోకంబులన్ గలచరిత్రము లెల్లఁ గానవచ్చు। నొక్కవృక్షమూలంబు నొక్కతరువుపత్రమొక్కటి యొకటిపుష్పంబు దాల్చు। వరుస బ్రహ్మాచ్యుతాంబికేశ్వరులు మ్రోల। పెంపు దీపింప నియతిఁ గ్రీడించు నతఁడు॥ (క) నొకభూరుహంబుకాయలు। నొక భూమీరుహమువందు నొకతరుబీజం। బకలంకుఁ డైభుజించిన । ప్రకటించి చరించునతఁడు ప్రమథులలోనన్॥ (సీ) తద్భూరుహంబులు దర్శించుటెట్లన్న మహాదేవుబాలుట్ల మల్లినాథు। భృత్యోపచారుఁడై పెరుఁగును నెయ్యిని పాలును గూడ ముప్పందుమునను। నభిషేకమొనరించి యాదేవుని సహస్రకలశాభిషేకంబుగా నొనర్చి యా

చిం చిధూపంబు లర్పించియా దేవునకు నెయ్యి నీరాజనంబు లిచ్చి। షడ్రి
సాన్నంబు లర్పించిశంభు నెదుర।మూలపంచాక్షరీమంత్రమున జపంబు।
ధీరమతిఁజేయఁగా మూఁడు దినములకును।దివ్యదృష్టి ప్రసాదంబు దేవుఁ
డొసఁగు॥ (గీ) కరళకందునికృప నంచుఁగలబిలంబు । గానవచ్చును దద
ద్బిలాంగణము దాఁట।బంచ యోజనవిస్తీర్ణపరిమితమున।బిల్వనామరు
హాపజ్తిశోభిల్లు నంత॥ (సీ) అంతంత బిల్వవనాంతరంబుల మహోన్నత
మైన యేకాంతభూములందు। జేనెంట నొక్కొక్క శివలింగము వసిం
చు బహుళాభిమతఫలప్రదము లగుచు।బారెంట నొక్కొక్క పరమసం
యమియుండు దర్శనపుణ్యప్రదాయకుండు। క్రోశంబు నందొక్క గురు
తపోవనమొప్పు ఫలవ్రతవృక్షసంభరిత మగుచు।రమణ నంతంత నొక్క
పురంబుగలదు। ప్రమథసంఘాతశాశ్వతథలద మగుచు।గరిమ నంతంతఁ
బెక్కుశృంగములు గలవు। సిద్ధసాధనగంధర్వ సేవితములు॥ (వ) అం
తముందట॥ (క) ఛాయావృక్షం బొప్పును।బాయక తననీడమీఁదఁ బా
ఱువరునకుఁ। ధూయిష్టకామితార్థని। కాయము లిడు మొదలె దృశ్యక
రణిమహాత్మా॥ మరియును సాధకుండు బిలాంతరంబున కేగి నంతట॥(చ)

—(*)సాధకుండు మోహినియను గజంబునుజూచుట.(*)—

ఎదురున మోహినీగజము హెచ్చి మహోగ్రభయంకరాభటిఁ। మ
దయుతఘీంకృతధ్వనులు మారొనియుండఁగ సాహసోద్ధతిఁ।బెదరక
నిచ్చసాధకుఁడు పెల్చ నేగుచు విక్రమక్రమా। భ్యుదితమహాప్రతాపము
ననుండఁగఁజూచి మదేభమున్నతిఁ॥ (శా) కుప్పించుఁ గడుఁ జెంగలిం
చునదరుఁ ఘోషించురోషించు మై।నొప్పించుఁ గడునుప్పరం బెగయు
దానుద్యత్క్రియావర్తనల్। దప్పించుఁ దలకించు దాఁటుఁగడుఁ గ్రో
ధవ్యూఢలీలాగతిఁ। తెప్పంబొప్పగ బిట్టువారు దిరుగుఁ ధీరోగ్రఘీం
కారతఁ॥ (వ) అంత సాధకుండు॥ (చ) తలఁగక చిక్కిఁ గానకత
ల్లడమందక కొంకకొంతయుఁ। దవలక పాఱికట్లనక తాలిమిదప్పకత

ప్పఁద్రొక్కుచుఁ। గలఁగక తత్తరింపక వికాసము దప్పక సాహసంబు
నన్। మెలఁగిన మోహినీగజము మెచ్చి యొనర్చును సర్వసిద్ధులన్॥ (వ)
అంత ముందట॥ (సీ) మఱియొకరు వనములో మహీధరాగ్రము మీఁద

—(*) సాధకుండు భైరవునింజూచుట. (*)—

సంధిల్లు బిల్వభూజంబుక్రింద। ఈశ్వరేశ్వరుని బిల్వేశ్వరుఁగని యొగిస
త్తరాత్రంబుల సాధకుండు। భక్తితాత్పర్యసంపన్నుఁడై భజియించియా
దేవుదీపతైలాంజనంబు। సేవింప దివ్యదృష్టిప్రకాశత నొందు కామారి
కఁరోప కంఠమునను। ధారుణీకృతిశోభిల్లుఁ దద్దళంబు। నందు ర
వణిల్లుక్షేత్రపాలాభిధాన। భంగిఁ బొడసూపునందులో భైరవుండు।
నెట్టి మానవులే తేర నెగ్గుసేయు॥ (ఉ) ఉప్పరవీధిపై నెగయు నుప్పనవీ
డఁగ నుబ్బిమోమునన్। నిప్పులురాలుమంటలును నిండఁగ గన్నులఁ గ్ర
మ్మనెకొనన్। గుప్పతిలంగఁ గ్రొంబొగలు ఘోరతరార్చులు సాగ
నార్చుచున్। జిప్పిలి ఖడ్గహస్తమున జిమ్ముచు హుంకృతి గూడ మొ
ట్టుచున్॥ ఇట్లున్న భైరవుం జూచి॥ (ఉ) ఉబ్బుచు సాధకుండు
కడు నుబ్బునఁ బొంగుచు సంతసిల్లుచున్। బొబ్బలు పెట్టి తిట్టు ఘో
ర హాస్యము లాడుచు భీతిలేక తా। గొబ్బున నేగి యాప్రతిమ గట్టి
శిరంబును ద్రెవ్వ దన్నుడున్। నిబ్బర మిట్లు మిట్టిపడి నిల్చియు మూ
ర్ధ్నము నవ్వ నిట్లనున్॥ (క) మెచ్చితి వరమును నీకీ। వచ్చితి నతిసా
హసోద్ధతి మెఱయన్। వచ్చితి వీబిల మిప్పుడు।చొచ్చితి నీకెవ్వ రెదు
రు సుజనాధీశా॥ (వ) మఱియు మద్గళద్వారంబు బిలద్వారంబువిచ్చే
యు మనుటయు నాసాధకుండును బిలంబులో దరసి చూచెద నరక శ

—(*) సాధకుండు తపస్వినింజూచుట. (*)—

రంబులేని భైరవుండు తపస్వియై యుండె నంత॥ (క) జడమడి తిన్న
గదిద్దుచు।నడుమును నిక్కించి యాననము వంచి కడున్। వడిలో న్న

దవులు గదలఁగ నెడపక జపమాలప్రాస వెన్నఁగ దొణగెన్॥ (గీ) సం
యమీంద్రునిఁ బొడగని సాధకుండు । ప్రోవయీవయ్య మునినాథపా
వవలయు ననిన సాధకుతోడ నిట్లనియెనతఁడు । మొగము ఱెప్పలు వి
చ్చితన్ముఖముఁ జూచి॥ (చ) శరణమ మాటయుం గరలెఁ జకటఁగనీదు
శిరస్థలంబుకై । కరములు సాగ వేమతిక్రీఁగ ష్టదరిద్రము భక్తివాక్యముల్ । బె
రవుగ పెద్దకాలమగు పెద్దల మిక్కుడ నుండఁ గామమున్। హరహరతె
కటసేయవు అహంకృతిఁ గల్గునె యిష్టసిద్ధులున్॥ (ఉ) కంతు జయం
తురూపనవకాంతివిశేషవిలాసవిభ్రమం । బెంతయు మించు నీతనువు ని
ట్టిది సత్యమునవ్వ గాదు నీ । వింతటివాఁడ వేమిటికి నేగితివన్న నమశ్శి
వాయ ధీ। మంతుఁడవిష్ణ సిన్ను నొకమానవుఁడెంచును నెన్నవచ్చునే॥
( సీ ) అదె పులి ముందట నడ్డమై యున్నది యిది నూఱు మగ ని
ల్వో లీబిలంబు । మును వెనుక దగరును ముందట నయ్యెన్న చంద
మే పఱడ నెట్లు చనఁగ రాదు। భక్తిని వెప్పుడు భజియించు లింగంబు సా
ధకశక్తి యీఁజాలు నయ్యె। పృథివిపై భక్తు లేబిలచయంబులు వేడుకఁ
జేరి దృష్టాదృష్టసిద్ధిగతిని। సొగసి పర్వత గవ్హరంబుఁ జూచి శక్తిఁ గల్గి
గవిఱంచు తల క్రిందుఁగాగ నేల। కుడిచి కట్టెడు ప్రాయంబు కొమరు
మిగుల । కొడుక చను దెంచితివి యేమి గుదువఁ గంటి॥(వ) మఱియుఁ జ

—(*) సాధకునకు తపస్వి బిలవృత్తాంతంబులం జెప్పుట.(*)—

తుద్వారబిలంబులును వృషభబిలంబులును బన్నగబిలంబులును ఖేచరబి
లంబులును మొదలుకొని పర్వతంబునం జేకొన్న బిలంబు లిరువదినా
లుకోట్లు ముక్తిప్రదస్థానంబులు వేయికోట్లు భుక్తిప్రదస్థానంబులు నూ
ఱుకోట్లు ఏకైకకార్యప్రదస్థానంబుల నంతంబులు గలవు అందులోనకొ
న్ని వివరించెదఁ జనియెడు వాఁడ లెట్లు చనియెదు గాక వినుమనుచు
సాధకుండు నాకర్ణింప నభిముఖుం డగుడు తపస్వి యిట్లనియె॥ (సీ)
వినుము నేనొక నాఁడు విపినాంతరంబున విహరింపఁ దద్వనవీథి నడుమ।

పుణ్యసరోవీధి మగ్గనక బొడిచి దివ్యాంగదీధికులు దివ్యాంబరములు! నొలయపుగా ధరియించి యుత్ఫుల్లహల్లకసరసీరుహముల హస్తములం బట్టి|మల్లికార్జునదేవు మహనీయపురమున కరుగంగం జూచి యాయ య్యపాద| సరసిజంబులపైం బడి సన్నుతించి|పుణ్యమున నిన్నుం జూచు నీపుణ్య మబ్బె| పావనాంతరఘనసరోవరమునందు| సంభవించిన గతి

—(❁)కరవీర వనప్రశంస.(❁)—

యిట్లు సంయమీంద్ర॥ ( సీ ) నరుడవో ప్రచ్ఛన్నహరుడవో నీవు కిన్నరుండవో శివభక్తిపరుండ వహ్వృత । కరుండవో పాతాళచరుండ వో నీవు భాసహరుండవో శివయోగివరుండ విట్లు । మరుండవో దానవేశ్వరుండవో నిజరేశ్వరుండవో సంయమీశ్వరుండ వనఘ । యే లోకమున నుండి యేతెంచి తిచటికి నేలోకమున కింక నేగు తెలుంగు| దేవవృత్తాంతమంతయుం దెలియవలయు| ననుచు వినుతింపమునినాధుం డట్లునిలిచి| విమలపోధన చెప్పెద విస్మయంబు|అనుచు మునినాధుండిట్లని యానతిచ్చె॥ (క) కరవీరుండనగసుశ్రీ| కరవీరగుణాకరుండు కమభ యభక్తిక| గరవీరేశ్వరుండనని |గిరివీరేశుంబ్రతిష్ఠించెం గ్రియుదోలుకా డక॥ (గీ) అచలితంబగు తపమునీవాచరింప| హరుండు ప్రత్యక్షమైయిష్టమడుగు మనినం|బుడమి సర్వాంగకంబులు పొందమొక్కి| భక్తిసంయుక్తినిట్లని ప్రస్తుతించె॥ ❁

ఈశ్వరునికరవీరుండుస్తుతించుట.

తాళవృత్తములు.

శ్రీపర్వతసింహాసనభక్తా- తాపసకల్మషచయసంహంతా- మానితపూతత్ర్యచినుతిపాత - శ్రీనగశృంగస్థితశుభపీఠ - వితతచతుర్దశభువనాధీశ ప్రధితశ్రీపర్వతమల్లేశా॥ ౧

నిఖిలజగద్ధితనిజభక్తేషు ప్రకటఖ్యాతిః పరమవిభూతిః । విపుల

హిరణ్యం విశ్రుతిపుణ్యం। వికసితకీర్తిం విలసితమూర్తిం । నిరుపమశ క్తిం నిశ్చలభక్తిం। ద్రవ్యపతిస్త్వం ధనేశత్వం । కురతేసృజతే కరోతిని ధత్తే।రచయతినిదధాత్యుత్పాదయతి।ప్రభవతిభారతిసంపాదయతి॥ ౨॥

దేవ శ్రీపర్వత మల్లీశ్వర। శాశ్వతవైభవ సకలప్రాభవ । విశ్వ ముఖాంబుజవిశ్వవిలోచన। విశ్వేశ్వరవిశ్వంభర మార్గణ। నిశ్వాసీకృ త నిఖిలశ్రుతిచయ। భవతకీర్తిశ్రీధావళ్యం॥ ౩॥

శరదభ్రమతి మందారతి కుందతి।నందీశతి నవసితవిహారతి కర్పూ రతి కైలాసతి చంద్రతి। కంఠీరవతి క్షీరసముద్రతి కుంతలితి డిండీరతి భారతి। నక్షత్రతి మరుదశనతి హంసతి। వికచకిలతి ప్రాలేయతి కుముద తి॥భక్తవత్సల పురహర శ్రీపర్వతాధీశ్వర మహేశ్వర। సమధిగతపా తాళగంగాసలిలబింబితహర్మ్యమందిరలలితపుష్పంధయా హల్లకగంధి పాణిగ్రహణకౌతుక।దేవసర్వజ్ఞాదమన్యేతవ మహత్వంకేసమర్థా।దు గ్ధపాథోధిప్రభూతోద్భూతగరళనీతిప్రయాతే.కమలజాతఃకమలశత్రుః క మలమిత్రః కమలనేత్రః క్రతుభుగధిపః కవ్యవాహః కర్బురఃకార్కోతరేశః। కమలసంభవనందనః।ఖరకరసుతః ఖచరేంద్రముఖాదేవ శంకరః పార్వతి శః త్రిభువనాధిపఫాలలోచన। చంద్రశేఖర నీలకంఠః శ్రీగిరీశ్వరరక్షశివ మాలి।మిళితపృస్తువతి నౌతి స్తౌతిశంసతి కీర్తయతే।ప్రచ్ఛఖ్యాతేగణ సుద తిశ్లాఘతిప్రవదతి ఫణయతి॥ ౩ ॥ భ్రమరాంబాముఖపంకేరుహవిభ్రా జనకారణదివసకరస్య।ప్రేంఖత్ప్రే ఖజ్వాలజ్వలనశిఖానిష్ఠితప్రసవాయు ధరూపస్య శ్రీమత్పర్వతమల్లికార్జున శ్రీశంభోతవ నిర్మలకీర్తిః।జృం భితరేఖావష్టంభోత్థితతత్తనుధావళ్యం జేతుం।కమలజపుత్రంకైరవమి త్రం । ఘనకైలాసం కంబుతికాసం।పద్మజయంతిఃపవనాశపతిం । ధ వళితకుందంతారాబృందం।పురకల్పకుజం పురుహూతగజం। వనజజవా సం వర్యవరాహం।శరదభ్రతి హాసద్రమతికచ్ఛపమతి ద్రామతినప్వతి। యాతి పాంచతిసరతిగ్రాయతి॥ ౪ ॥ జయజయరంగతనంగశుభాంగ

—(*) కవిరాజవిరాజితము. (*)—

కురంగధృగంగయుతస్వచ్ఛం। శశిచ్ఛవిగుచ్ఛసుధారసకచ్ఛజటాఝటనుమతిచ్ఛందం।గర్వబలాంధకఖర్వటహరణాఖర్వసుశ్రీతికంధరపర్వవిహారం। దుర్వహఘనచర్వణదనుజసుపర్వనుతశ్రీపర్వతలింగా ॥ ౫ ॥ అద్రిభవమిత్రి భవచిత్రకరనేత్ర శతపత్ర సుపవిత్రతతవిచిత్రచారిత్రా।పంకజదృగంక మకరాంక హరకింకర వశంకరశశాంకధర శంకర మహేశా॥ అక్షయ విపక్ష సురరాక్షస బలక్షపణ లక్ష్యనిటలేక్షణ కటాక్షవిక్షేపా। దక్షసవశిక్షణసమక్షసంద్రక్ష శివ రక్ష మాంపర్వతాధ్యక్షా ॥ ఉద్వాసంతెకకు బంతెషు ప్రసృమలనిర్మలకీర్తే నీయుస్తవ అభ్రిము పరివృద్ధవిభ్రిమసదృశా। శరదభ్రిభ్రాజచ్చంద్రాభ కుందాదభ్రిశిత భ్రిద్యుతయః శుభ్రిమహాభ్రినదీప్రతినిధయః । సురతరుగుచ్ఛాయాపరిస్ఫురితాగుచ్ఛస్ఫటికస్తబ్ధయః । స్ఫాయితకుముదస్ఫారద్యోతా స్ఫుటవిచకిలతిస్ఫూర్తిస్ఫురణాధారస్యట్టహాసప్రకృతికృతయః । అక్షయకరుణాలక్షణవిచక్షణ। యక్షాముని రక్షాదక్షకటీక్షితక్షుభితక్ష్వేదాక్ష్వేదితరక్షక్షేత్రక్షపణక్షమబిలశ్రీమత్పర్వతమల్లీశ్వరమూర్తే॥ శ్రీపర్వతపురసింహాసనవర।లింగచక్రవర్తి శ్రీగిరిమల్లీశ్వర।వర్ధస్వజటాటవికోటిత పాటలసుమనస్తటినీయుక్తా। రుచిరబిసప్రకరశరజలదసురద్విరదమరుధరణిరుహస్వజవననిస్వాయదతిభీతికమణిస్వరహేమస్ఫుడమ్మృగ స్ఫూర్తిధగద్ధగితలసద్ధవళనయనః॥ ౮ ॥ అని స్తుతియించి యిట్లని విన్నవించె॥

(క) కంజభవాండోదుంబర।సంజాతనికృష్టజంతుసంసారివహా । మంజులనాటకమాయా । పుంజము సురవైభవంబు బుద్ధిఁ దలంపన్॥ (క) నిత్యేతరు లింద్రాదులు । నిత్యుండవు నీవు నిఖిలనిర్మాణభవా।నిత్యార్చనక్రియార్థము । లత్యుత్తమపుష్పభూరుహములై యుండన్॥(గీ) భర్గ నిన్నిట్లు వృక్షరూపంబుఁ జేసి । అభవయందులపుష్పంబు లవధరింపు । దేవలోకేశ శివజగద్ధితచరిత్ర । పరమపావనభవ పరబ్రహ్మరూపా॥ (క) అలికాక్ష తత్ప్రసూనవు । దళములఁ బూజించున

తపస్వి తన్ను చెట్టుగా జేసి పుష్పవలుగోరుంచి

పూజగై కొమ్మనికోరుట.

ట్టి ధన్యుల కెల్లన్ । బలజేది విభవ మొసఁగును । అలరులఁ బూ జింప నొసఁగు నపవర్గంబున్॥ (గీ) అనుడు నసమాంబకుండును న ట్లయొసఁగ । వసుధ విలసిల్లె గంవీరవన మనంగ । చెట్టివానికిఁగా నగా దీవనంబు । ఘనుఁడ నీవు న్యఫలమునఁ గానవచ్చె॥ (క) కగల కు మింకఁ దపోధన । కలితివేనిపుడు మఱ్ఱిఁ గానఁగ రా కుం డిదిక రవీరవనక్రమ । మది పుణ్యసరోవరంబు మది యెట్లన్నన్॥

—* తృణబిందుసరోవర ప్రశంస. *—

(సీ) తృణబిందుకర్దమ ధీవరపారీసనహితమై తాప సాశ్రమము వోలె । దారుణ బకకంక ధార్తరాష్ట్ర వ్యాప్తి నభిమత వ్యాసకావ్యంబు వోలెఁ । జలకాలయుతమహాజీవ నస్థితియందువర మంత్రసిద్ధదేవతయుఁబోలెఁ । కచ్ఛపమకరశంఖస్థూలపద్మవి స్ఫూ ర్తులధననాథు పురమువోలెఁ।బుషట్రోత్ఫుల్లహల్లకపుండరీక।ఫలితమక రందవిభ్రమభ్రమరనికర। గాయకోత్తమబంహిష్ఠగానఘోష। రూఢసు ఖదంబు పుణ్యసరోవరంబు॥ (గీ) లోకపావని పాతాళలోకమార్గ। మీసరోవరమాహాత్మ్య మిదిమదీయ్య। విధముఁజెప్పెద వినవయ్య విమల చరిత్ర పరివసింతును శాంకరీపట్టణమున॥ అట్టిపురంబున కట్టి నామం బె

—(*) శంకరిపట్టణనామప్రశంస. (*)—

ట్లయ్యెనంటేని॥ (ఉ) బాలకినైభవాని హిమపర్వతపుత్రిక యైన నాఁ డుతా।శ్రీలలితాంగి బొమ్మలకుఁ జిత్రపువన్నెల బొమ్మ పొత్తికల్।చాలఁ గఁగొంచు రమ్మనుచు సమ్మదలీలల నేగి జాహ్నవీ। కూలపవిత్రదేశముఁన బొమ్మలతో డుత నాడుచుండఁగన్॥ (క) సురకన్యలు నహికన్యలు।గిరిక

న్యాసముదయంబు కిన్నరకన్యల్। వరరుద్రకన్యకలుహిమ। గిరికన్యకఁగూడి యెప్పుడు క్రీడయొనర్పన్॥ (ఉ) అంబిక జాహ్నవీతటమునం దొనరించెను బొమ్మరింట్లచం। దంబున నొక్క పట్టణము తత్పురమధ్యమవీధిభక్తితో।శంభుఁ బ్రతిష్ఠజేసి జలజాననయిష్టతపంబు సేయ ఫా। లాంబకుడంబుఁ గ్రైకొని సమంచితసౌఖ్యము లందుచున్నెడన్॥ (క) జలజాయతాక్షి యప్పురి దలఁచిన శివుడెట్లఁగినీవు దలచినపురియున్। నెలకొలిపితినీపురి గాఁదలఁచిన సికతాపురంబు తామరసాక్షీ॥ (వ) అనినవినియుభవాని యత్యంత సంతోషాయత్తచిత్తయై ప్రస్తుతించె నదనంతరంబు॥(క) శంకరు నర్ధాంగనయగు। శాంకరి జలజాయతాక్షి సంధించుటకున్। శాంకరిపురమనఁ బరగెను।శంకరు భజియింతునచట సమ్మానమెసఁగన్॥ (క) నా పేరుప్రప్పంతుఁడు। శ్రీపర్వతమునకువచ్చి శ్రీగిరినాథున్। శ్రీపాదములర్చింతును దీపితశివభక్తియుక్తి దృఢనియమములన్॥ (గీ) ఇట్లువర్తించి యొకనాఁడు వనంబు। పుష్పనివహంబుఁ గోయంగఁ బోవువారి।గూడ నేతెంచి యేనునుగూడి యొక్క।ఘోరనిస్స్వాన పటహాని ఘోషమెసఁగ॥ (క) అప్పుడు దశదిశలందును।గప్పుడు గతిదప్పికీలుకడురయమునఁ దా।గుప్పనధరణిన్ బడుటయు।నప్పుడుతనుఁబట్టి బన్నగాంగనలెల్లన్॥ అరుగుదెంచి (గీ) యువతులంతంత ప్రియమునన్నల్లనంబు।నడప నసలారఁ దన్ను నెన్నడుము దొడికి।యింతు లిరుగుబ్బ పాలిండ్లనిరియఁబట్టి కదిసికొనిపోదు రభినవకళలతోడ॥ (వ) అందులోనొక్కప్రౌఢాంగన నీమువృత్తాంతంబుఁ జెప్పెద వినుమనియిట్లనున్॥ (సీ) పూర్వజన్మంబున భోగీశుఁడనులింగమునకుఁ బూజాబంధములు రచించ।నొక్కపుష్పంబులో నొకతేటిదగిలిన తప్పునకై నీవు ధరజనింప। వలసెననస్వల్పవాఁడవుగాన నిన్ను భవుఁడు కరుణించు ననుచుఁ జెప్పి। నాతులుఁగొనిపోయి నాగలోకంబున భోగవతీనదీ పులినతలము। నందు నిలిపిన దివ్యదేహంబునొందె। తెలిసెజాతిస్మరత్వంబు దృఢముగాఁగ। బరమవిశ్వాసభక్తి నాశ్చర్యచర్య। భోగనాథునిఁగని మొక్కి పూజసేయ॥ (గీ) పుణ్య

ఫలదాయకుండగు భోగినాథు। నెమ్మి పూజింపనను గరుణింపునిచట।
చంద్రకోటీరు శ్రీగిరీశ్వరు భజింతు।ననుచు నామానితనపురి కరిగెనంత॥

—(*) వృషభబిలవృత్తాంతము. (*)—

(సీ) వినవయ్య మరియును విపినాంతరంబున కేబత్తిలికిఁ బ్రీతి నరుగు నెడను । నందొకట యాబోతు నచలికప్రభతోడ నున్నతాకృతిఁ జూచి యుల్లసిల్లి । నొకట పుణ్యుండు సముత్సాహభక్తితో నం బ్రదక్షిణం బాచరించి। పలుమారు మ్రొక్కుచుఁ బ్రణుతించి వృషభంబు ఇకట డమగడి తానీబిలంబుఁ। జొచ్చిన నామది చోద్యమందుచువచ్చి యాయయ్యకును మ్రొక్కి యతనిఁ బొగడి। యెందనుండుదు వెవుడు నీవెవ్వ రనఘ। యిట్టి వృషభంబు నెకట డి కేగు తెరఁగు ఇంత సంభ్రమమేల యుండేల సిద్ధి।నీకు నియ్యాన చెప్పుము సిగ్గులొన్న॥అనుడు నాతపసి యిట్లనియె॥ (సీ)వినవయ్య యితఁ డాదివృషభేశ్వరుఁడు కర్మజనులకు వేఱొకట చంద్రముండు।జగముల రెండవ సర్వేశ్వరుండన నాద్యుండు శ్రీపర్వతాగ్రజుండు। నాలుగు యుగముల నాల్గు పాదంబులన్ చేయుగాంచరధమ్మ మెఱిఁగి నడుచు।సప్తరాత్రంబులు జనులెవ్వ రేనియు ననశనవిధిన నేకాగ్రచిత్తుఁ। డగుచు నీబిలమార్గంబు నందు నిల్వ। నంతఁ గృపపుట్టి వృషభేశుఁ డరుగు జేర। తొలఁగకా వృషభేశుని తోఁక బట్టి। బిలములోనికిఁ గొనిపోవు బృథులగతిని॥

(క)వృషభపురీప్రాంతమునకు। వృషభేశుఁడు గొంచుఁ బోయి విడుచు నతండున్।వృషభేంద్రతీర్థమ్ మాడియు। వృషభేశ్వరుఁ బూజ సేయు విమలాత్ములకున్॥(గీ)అంతఁ బ్రత్యక్షమై వృషభాధినాథుఁ। డెల్ల కార్యార్థసిద్ధుల నిచ్చుచుండు।వారిలోపల మోక్షాభివాంఛితులకు। నెల్ల కైవల్యవిభవంబు నిచ్చుచుండు॥(ఉ) కామితభోగముల్ త్రిగణికాపరిరంభణదివ్యసౌఖ్యముల్ । కామదుఘావళుల్ సకలకల్పమహీరుహసంచయంబులున్।గామశరీరసంపదలు కామనిషాదనఁ డిచ్చు నిచ్చలున్। గా

ని:శభక్తి గొల్చి ననఘాత్ములకును దయతోడ వెండియును॥(వ)ఈవృష భేశ్వరు చేత నిష్టార్థసిద్ధిసముదయంబులు వడసి సాధకుండు॥(చ) త మ నిజవాసమున్ దలంచ దప్పక యీవృషభేంద్రమూర్తికి యు। వ్విమల తనుండు నిల్చి ననువిశ్రుత వాలముఁ బట్టినన్ నిజ। క్రమమునఁ దెచ్చి యు బ్బిలమునూఖంబు దెస న్వెడలింప నీప్సితా।ర్థములును సంభవించు ననితా పసముఖ్యుఁడు చెప్పె వెండియున్॥(మ)చన నల్లంతట నొకట నిమ్మను

—(*) తాళవృక్షప్రశంస. (*)—

జడోస్థానసంకీర్ణతా। శనమధ్యంబున నుండె నేను ఫలముల్ వాంఛా రతిన్ గోయుచున్।కనుఁగొంటిన్ భువి నొకట తాళదివి దాఁకన్ వీడి యందుండి తా।ననిశంబున్ ధర కేదిగన్ బెరుగఁగా నా తాళవృక్షంబు పై॥(మ)కనుగొంటిన్ శతరుద్రు డగ్గిరి కివృషారూఢుండై కొల్వఁగా।వ ని కీర్తింపఁ దపస్వి దోఁచెఁ దపసుం డత్యంతమున్ గ్రుంకినన్।ఘనతా ళంబును గ్రుంకఁ దాపసి ధరాగ్రస్థాయినై యుండినన్। జనిమె న్మా ని నుతించు వేడితి మహాశ్చర్యంబు సంధిల్లగన్॥(గీ)తాళదివి కేగి యి ట్టులు ధరణి గ్రుంక।వెలువ కేరీతి నిల్చితి వృక్షశృంగ।మెకిట యెవ్వరికం టె యుండె మిద్ధి।పూజ మెప్పాటు నీకెట్లు పొందుపడియె॥అనవుడు త పస్వి యిట్లనియె॥(క)జననుత యీప్రాంతంబున।మన కడనై నిల్చి యీ దయవజ్జనకాలం।బున లింగము పూజ సేయుచు।ననవరతధ్యాననిష్ఠ న లవడియుండన్॥(సీ)తుదల నకారాంశులు దోఁపంగ నీతాడి తుదయాకు లును మట్ట తుదలదోచె।నుదయాందిదీధితు లాదవంగ నీమ్రాను నుదయా ద్రిశృంగాలు నుద్గమించె।మొదలమయూఖముల్ మొలవ నీవృక్షంబు మొ దలి పత్రంబులు మోసులేసె।కొదమనూనూగు వేగొనలు దేవులు సాగి చుదిమోసుటాకులు దొంగలించె।పొదలి భానుండు యుదయింప భూరు హంబు।బేచిరి యంతంత నుప్పనఁ బెరిగె దివికి।వినుతలింగార్చనక్రియా వేళభక్తిరీతి నుంటిని నిష్ఠాగరిష్ఠమునను॥ ( క ) రవిరథ మేగెడు దివి

కిన్ । దిపి నాఁకేను దరువు పెరుగఁ దిరముగ నుండన్ । నవకమలకే ణీకాంతర భవనస్థితి నున్న యట్టి భ్రమరముఁ బోలెన్॥(గీ)తపనుమ ధ్యాహ్నవేళ బాదపము దరియ।వలినమిత్రుండు హర్షించి నన్నుఁజూచి యినుఁడు సత్కారసంతుష్టహృదయుఁ జేసి।అనఘ యవ్వేది యాప్సిత ము డుగుమనిన॥ (వ) దినకరున్ జూచి యిట్లంటి॥(సీ) సప్తాశ్వవినవయ్య సర్వాద్రిసారభౌమోత్తమశ్రీగిరి యునికిపట్టు । హరి పద్మసంభవాద్య మరాధిపతియైన మల్లికార్జునుఁడు మహాల్లభుండు।వేదశాస్త్రపారగులకంటె వేయింత భాగ్యంబుగలుగ నేటికి నాకుఁ గమలమిత్ర । యేమియునే నొల్ల నీతాళవృక్షంబు ఈక్షితి నుదయించు టేమి తెలుఁగు । చనఁగ న టమీఁగ కొనసాగశక్తియెట్లు । గలిగినది మోచు టిది యేమి కారణం బు।మెట్టి తెలుఁగు నీభువి గ్రుంకుటేమి వినము । తెలియఁజెప్పుము యిం తయు తీవ్రకిరణా॥అనిన నతనిన్ జూచి సూర్యుండిట్లనియె॥ (వ) శ్రీప ర్వతుని తపోమహాత్మ్యంబునంజేసి శ్రీనగంబుమీఁద సూర్యతాళంబులును న క్షత్రతాళంబులును వర్తించు సూర్యకుండంబున స్నానంబుఁ జేసి సూర్యే శ్వరలింగంబును బూజించినవారికి సూర్యపదంబుగలుగు । నిట్లు ద్వాద శాదిత్యులు తమతమ పదంబులు వడసిరి। యీశ్వరానుగ్రహంబున సూ ర్యతాళంబెక్కి వచ్చినవారికిం గామింపలేమి యఁ బద్మరాగమణులైన గొమ్మని చ్చెద శ్రీగిరీశ్వరుఁ బూజింపఁబొమ్మని యిప్పించి సూర్యుండరుగ నకుటజంబును భూగర్భంబుం జొచ్చె మల్లికార్జునదేవుం బూజింపఁ బోయెదనని యంతయు తపస్వి చెప్ప వింటిమరియును॥(సీ) వెండియు నొకనాఁడు విపినస్థలంబున నుండంగఁ దనముందర నొకఁడుభీతిఁ । గాని యురంబున నంటుకొనియున్న యర్భకశవము దానునువచ్చి చకిత నిలువ।నోరోరిభీతాత్మ యెకడ నుండి నీవే తెంచితివి యిది యేమిశవము। యేపురంబుననుండు డెప్పుడు వెవ్వ డవనుచు నాతనిఁ జేరియడుగ మా ని!వినుతవినవయ్య పులినుండి వేగజాము । గడచి పుష్పంబులకుఁబోవఁగ డువు గడల । జెలనదీతీరమునఁ జేరి సజ్జపెట్టి । కొంత దవ్వేగి కూ

చుండి కుతుకమునను । ఇట్లు శౌచంబునకుం గూర్చున్న యెడ ॥ (క) మానాక్షిట లజ్జింపక । యీవెంగిలి యిట్లు సేయ నుచితమె యనుచుఁ । భావించి నాల్గు దిక్కులం । వేవేగము చూచి బాలవిస్మ యమందఁ ॥ (ఉ) ఇక్కడనూరు లేదుమరి యిల్లునుగాదిది యేమి చో ద్యమో । అక్కజమంచు నొక్కశిలయెక్కడ నిక్కవగానొనర్చి తా । జిక్కిన గొంత దవ్వరిగి శౌచముసేయఁ దొలంగుసంతలో । నక్కడ నిట్లు వల్కి ననునక్కడనన్నిక్క దరాలనిల్చుచుఁ ॥ (చ) సరభసలీలఁ గొంతదవ్వుచన్యా న నేగితొలంగి తాబహి । ష్కరణము దీర్చి యంతటను శౌచము నా చమునక్రియాదులుఁ । బరిణతినాచరించి పురభంజనునీశ్వరుఁ బూజఁజే సితాఁ । గరమున దొప్పఁబట్టుకొని క్రమ్మఱనేగితి దొంటిచోటికిన్ ॥ (క) కందువదప్పక నటభి । త్తిం జేహియంటంచు నడుగఁ గమలదళా క్షుల్ । ముందటమేనులు చూపక । యందఱు నేతెంచు రవటికన్నముగా నుచుఁ ॥ (ఉ) పంకజలోచనల్ మృదులపల్లవకోమలబాహువల్లరీ । కం కణనిక్వణన్మణివికాసము శుద్ధత నొప్ప హైమతా । టంకమణిచ్ఛటల్ కిరణటంకవిటంకవిఘట్టనప్రభల్ । పంకజమిత్రుతో నొరయు భామలు భిక్షముఁ దెచ్చి పెట్టుచుఁ ॥ (గీ) అతివయందిచ్చు దివ్యాన్నమనుభవించు । పుణ్యఫలమునఁ గంటి తత్పూర్వవరంబు । అంతనప్పుడు కమలాక్షయంబు నగు చు । నలినపత్రాక్షి యొక్కతె నన్నుఁ జూచి ॥ (సీ) తనపురంబునకు న త్త రుణి తోడ్కొని పోయి నవసౌధపీఠిపై నన్నునునిచి । అభ్యర్చనాదిక్రి యాన్వితుఁ గావించి రమణతో దివ్యాంబరములు దాల్చి । షోడశాభర ణసంశోభితుఁ గావించి గంధమాల్యాదిశృంగారుఁ జేసి । బంధురదివ్యా న్నపానంబులనువప్పి పొలఁతి కర్పూరతాంబూలమిచ్చి । వనిత వరి యించి నన్ననవరతభోగ । సౌఖ్యాంబునిధిలోనఁ జొక్క జేసి । చా రులోచన మరి దివ్యవరషకోట్లు । సలుప దగ్గభంగ మొందిన లలన జూచి । (క) సిక్కంబు నాకు నీసతి । దక్కెఁగదాయనుచు నా త్మందలఁచిన భావం । బకామినితనమదిలో । నొక్కింత యెఱింగిన

జెప్పి యమ్మ్గతి యంతఁ ॥ (ఉ) చెచ్చెరగర్భముఁ దనదు చేతు లయందునుఁబ్రచ్చి యభ్రుకుఁ । బుచ్చి మదీయ దేహమునఁ బొమ్మని వైచినదాని నెప్పుడో । వచ్చిధరాతలంబునను వ్రాలితి యిట్టిదిచం దమంచునే । నచ్చరువందఁజెప్పి పురి కమ్మనుజోత్తముఁడేగె వెండి యుఁ॥ (సీ) అంతటనే వినోదార్థమై యేగుచుఁ గను.గొంటి నొక

—(*)బాలబిలప్రశంస.(*)—

గిరికంధరమున। నొకమానిబిలములో నుండి యేతెంచినఁ గాంచియా ముని యున్నకడకునేగి। యెక్కడనుండి నీవేగెదవనవృడు సిదిబాలబిలమం దురందు మొదల।గదలక దినసప్తకము నిష్ఠతోనుండ నొకకొండబిలమున నుండివచ్చి। సరసపంచామృతముచిలిక సవతసాప। యింతి నిటుపట్టుమ ని చేతికిచ్చిపోవ। కంటకంబునవాపోవు గరచువచ్చు। సాధకోత్తమ తను వుమాంసంబుదివగ॥ (క) తలకక పండ్లిలకరవక కలఁగక కరసడ్డమిడక కదలక మదినై। నులుకక బెదరకయదరక। యలఁగక మెలఁగినను దేవ తాంగన మెచ్చుఁ॥ (క) ఆవనిత దివ్యదేహము।గావించి యభీష్టసిద్ధి క రుణించినసం। భావనముఁ బొంది యిచ్ఛాభూవలయంబునకు నెట్లుపో యెదననుచుఁ॥ (గీ) యోగవాగాలు పెట్టి యుద్యుక్తుఁడగుచు బహుళ శిలలందుఁ బదిలమే పాలనసిన।తాపసోత్తమ వినవయ్య తత్క్రమంబు.అ నుచునమ్మౌని యిట్లనియానతిచ్చె॥ (సీ) కల్పోక్తపద మొంది కడురయం బునఁబ్రోవఁ బర్వతాకృతినొకట పాముని ల్వతద్వదనము బిలద్వారంబు గాఁజొచ్చి సపఁణంబుకడతను శంకలేక।ప్రథితశూలాకృతి పావాలనేమె ట్టి శ్రీకంఠుఁ బాదుకాసిద్ధనాథు। కడకేగి మదిలసద్గౌరవంబు జలఁగద శించినిష్టచౌతనరసిపుడు। మూఅపంచాక్షరీమంత్రముజ జపింప।నురగ రాజున్రప్రకటమై యుర్వినుండు।చూచి కడకేగి మరుగునఁజూచుచుండ.న ట్లుమరియొకట సపఁణంబు నధివసించె॥ (క) ఉరగంబుగడచి ముందట। దరిహొత్తుకట ను నిలిచినీరుద్రావు నపేక్షఁ।సరసీజలములు మెట్టిన।కరము లుచెగిపడినసవుడు కమవేగమునఁ॥ (క) కదియంబెట్టితునకలు।మొ

దలనుసంధానకరణి మోపినకడకన్। ముదమందిజలము దోఁచిన।సాఁగ
తఱరిపాణిగాగ నరుదందిమదిన్॥ (చ) అరుగఁగనంతముందటమహాం
ధగజంబులు పారుచెంచిచన్।కరములు సోఁకకుండఁగొని కతఱరిపాణి
యె మిఁడజల్లుచున్।కరుళకు దేహముల్ మసియఁగావడిఁ బారుమదేభ
రాజితా। నరుగఁగనంతరాలు దమనంటఁగజిక్కిన భద్రదంతులన్॥(క)
ఘనతుండంబుల నిడుకొని।యనిశంబు శిలోదకంబు లనివార్యటదెసన్। గని
చల్లిన నవి వాయుఁడు। చనియేనుఁగులన్ జూచిమరియు సమ్మదమెసఁ
గన్॥ (గీ) తాను గరపజ్జులశిలోదకంబుఁ బట్టి।యెదుట ముందటనంటు
రాలంటుకొనఁగఁ। దడయకంతంత నాశిలోదకముఁ జల్లి।ధరణి నటమీఁ
దవెనువెనర్ దాఁటిచనగ॥ (సీ) భూమండలము ననభోమండలమునిం
డిసర్వదిక్కులుగప్పి సమధికముగ। యోజనోన్నతమును యోజనాయత
మునైయుండు బిలంబులోనొక్క తరువు। గనియాకుజంబు మార్గంబనియె
క్కఁగఁ దనకంతనొకకోఁతి తరువుఁబొంది। నమ్మహీరుహశాఖ మం
దందనాటుచు నురుకుచుఁదిరుగుచు నుండనంత। నిక్క మాఁకలి పుట్టినం
ద్రాక్షఫలము। తానుభక్షింప నొకచిలుక తనువుఁ బొంద।మాని మీఁదనె
చిలుకయైమసరిమసరి। క్రమముమీఱఁగనొక తరుశాఖగదియ॥ (క) త
నకంత భ్రమరతనువై। ఘనపరిమళపుష్ప రేణుకాంతామతితో। ననవర
తంబునుదిరుగుచు। చననటగగనముననొక్క శైలముఁబొంతన్॥ (ఉ) శ్రీ
పరమేశ్వరార్చనము సేయుచునుండు మహానుభావునిన్।దాపసిఁజూచి
యేనడుగుదమ్ములమీఁద వసించునంతఁద। బ్రూపనుమాన్చి దివ్యమగు
రూపముగా మునినాథుఁడిచ్చి ది। గ్వ్యాపితవర్తనల్ సుజనవంద్యుఁడు
దెచ్చిదయార్ద్రచిత్తుఁడై॥ యంత సాధకునింజూచి యాతపస్వి యిట్లని
యె॥ (గీ) సాధకోత్తమ యిదియె ఖేచరబిలంబు।మరియు ముందరనెను

—(*) ఖేచరబిలప్రశంస. (*)—

మంటమందుమాడ్కి। నున్నపావకశిఖలుపై నురుకనీకు। యోగవాగాల
గతినుండుయోగివర్య॥ అనిన సంతోషాయత్తచిత్తుఁడై॥ (క) ఈతాప

సిచెప్పినక్రియ। నాతతమగునగ్నిశిఖలయందు దుముకుచుం బ్రస్ఫీతాగ్నిదహా
గవాగల। భూతిక్ సిద్ధించుఁదనకుఁ బరమేశుకృపచే॥ (సీ) వడసినసహ
స్రారపరిమితంబయ్యును సర్వసిద్ధులునాకు సంభవి నాగమకింపుయో
గవాగలు మెట్టిదలచిన భువనంబునకుఁబోదుఁ బుణ్యచరిత। నాగలోకస్వ
ర్ణనలిన-బుదీపించు భోగవతీనదిపుణ్యజలము। భాగిరథిని దెత్తు భవ్యో
దకంబులు కలువలుపుండరీకములు దెచ్చి। శర్వునర్చింతుఁ బర్వత సార్వ
భౌము। నంబికాధీశు శ్రీమల్లికార్జున నేను। నభవ్రంబూజింతు ననుచు
నాయతియు నరిగె॥ అనినఁ దపస్వింజూచి సాధకుం డిట్లనియె॥ (సీ)
బజ్జ ఋశిష్యుల కుపదేశములఁ జెప్పు పథమునఁ జెప్పినవెలివ నేను। చాలునీ
థధ లింక శ్రీగిరి మహిమలు ఎన్నంగ నాపద్మజునకుఁ దరమె । మెట్టు
దు పులినైన మోరలంగా రాకుండ భంజింతు కడకాలుఁ బట్టియే
ను । దక్ష నాగమనంబు తద్య మిట్టిది పెను దొక్క నేబిలమైన దోరి
చిపోదు । బిహ్వాలము లేక మాదిఱంతు విఘ్నములను నీదుశివలాంఛనం
బులునిన్నుఁ బూచి యోడిలంఘింప జాలకయుంటిఁ గాక । చాలినశ్నాగశ
క్యమె సంయమీంద్ర॥ అనుచుఁ దపస్వి వితర్కించె॥ (క) మదివెలుఁగు
నొందియుక్తులు । వెదకుచు దనముకర మీదవేలిడి శిరముఁ । గది
యించిదిన కళాసము వదలించుచుఁ జంకనిడుచు వేగమెచనుచున్॥(వ)

—(:) భైరవబిలప్రశంస. (*)—

ఇవ్విధంబున వీనికిఁ జిక్కింప రాదనుచుఁ దపోధనుం డదృశ్యుండైనఁ జూ
చి సాధకుండును నతనిఁ గుటిలతపస్విగా నెఱింగిన నంతకుమున్నె భై
రవుండు బిలద్వారంబున నొకట బెబ్బులి రూపుదాల్చి యుండె నంత॥
(సీ) జితదైత్యకరవాలజిహ్వా సాగగనిచ్చి యాయుతెదనగహ్వరము దె
ఱచి । బ్రహ్మాండకపటరగ్రాసకబుద్ధిని భీకరాకృతి నేచిబిట్టులాడు। గం
డమహేంద్ర సంఘాతంబు లూటాడ నిశ్వాసపవనంబు నిండసిగుడ ।
ఘుట ఘుట ధ్వని శైల గుహలు చిల్లులు వోవ నింగినాకనకుడుౘి
వంగ రొప్ప । నెడద కొనిమూచు కన్నుల నిప్పులురుల । ఒద్ధమా

త్సర్వవిక్రమోపాక్రమాత్మ । భగ్ననిర్భరవిక్రమభ్రుకుటవేళ। భూన
ధోవ్యాప్తి రోమాంచలపుంగవుండు ॥ (చ) కరుల మదంబు కేసరినికా
యము కోప మశేషసృష్టికో । ఖరవిషజాలముల్ శిఖిశిఖాతతి వేడిమి
వాయుతీవ్రముల్। సురపురాజతీవ్రతయుఁ జొక్కముగా నొకరూపు
దాల్చెని । భరగతిఁ జిచ్చి బెబ్బులి యభంగురదర్పమహోగ్రమూ
ర్తియై ॥ (ఉ) పొంగుచు బుగ్గలింపుచునభోగతి దాఁటుచుమీఱి పా
ఱుచున్ । మ్రోఁగుచు నావులింపుచును మూల్గుచు మీసము లోరగిం
చి తా । నంగము సాఁచి నిల్చియలికాగ్రము సుక్రిందఁడ వాల మా
చూచున్ । ముంగల జిహ్వసాఁగ నిడి మూతులు నాకుచు హత్తరింపు
చున్॥ (వ) ఇవ్విధంబున భయంకరక్రియ దాల్చినబెబ్బులిన్ జూచిసా
ధకుండిట్లనియె ॥ (సీ) పులిరక్కసునిగావు బొంతు గాఁబోలు నాజ్వాల
నాత్మచే మున్నుసమసె నేని । యీబిలాంతరము నెట్లున్నవాఁడొకో
యుగ్రాత్మువకు వోడియున్నవాఁడొ । తపసిచెప్పిన పులితానకో నా
స్పృహ దారుణనిష్ఠ్యూతదర్శరూపి। నీత్మెంతు వ్యాఘ్రింబు శీఘ్రంబజం
తుపుల్ గలవె నాముందఱ గదిసి నిలువ।దొలఁగకున్నను ముందఱఁ దృ
ళ్ళగిలిన । క్రోవ యీకున్న మసలిన త్రొటుపడినఁ । జికెరగాకింక
యిదియు నాచేత మగుడి । చనఁగ వచ్చునెమదిఁ నంతు సాహసమున ॥
(శా) దండింతున్ దలకింతుచేత నడతున్ ధట్టింతు గారింతుమై।ఖండిం
తున్ మడిఁ యింతుఁగొట్టుదును ఘట్టింతు సాధింతును।ద్దంతకోద్ధసవిస్ఫు
లింగకణసందర్భప్రతాపోగ్రతా । ఖండాడంబరగర్వరేఖ యడఁతున్
గంభీరశౌర్యోన్నతిన్॥ (వ) అనుచు నుగ్రతపట్టు నమ్మాంత్రిలోఁ బర్వ
తాకారంబున నేలవ్రాలిన బెబ్బులిన్ జూచి సాధకుండు॥ (గీ) బెద
రకెంతయు నదరక భీతిలేక।యలగ కదరక చింతింప కదరిపడక।యులు
కకోడకతలగక యుదరిపడక। త్రొలఁగిపోవక తలఁగక త్రొటుపడక॥
(సీ) ఒకచేతఁ బులిమీసలొడసి చయ్యనఁబట్టి యొకచేతఁబులి దౌడలో
సంచరించి । చరణంబు చరణంబుఁ బలికొన సవరించి ధరను వెలకిల

నూకిదండినార్చి। పులియును నదృశ్యమై పోవఁ బోవుటయును కలను మే
లొరని చూచు కరణిసుండు।నంత తొల్లిటి యట్ల నెదురంగ ముందటఁ
బ్రభవించె నంతలో భైరవుండు । విపులఘోషంబు గనుఁగొని వీని మెదు
రగెలువ కాదని బిలములో గల్లు మీరి । మారుకొని యుండు నహి మ్మ
హియై మండుచుండు । బిలముమధ్యంబుఁ జొచ్చె నాసాధకుండు॥ క॥ శ్రీ
రికీట మగునను । నరి మురి నొకకొంత దూర మరుగఁగని । ట్లొర
కంబుగఁ గూచుండియు।నురుకన దనరాక తారి యరుగుచునుండన్॥
(క) అటమెందర దావానల । చటులార్చి ప్రభలుబిలము చయ్యననిం
డన్।నిటలాక్షుకంటి మంటలు।పటువగు రాత్రినిండఁబట్టినభంగిన్।(గీ)
జడిసిపోవక వీక్షించి సాధకుండు । వడిని దాఁటుచు వహ్నిలోఁ బడిన మ
చ్చి।పలుకప్రత్యక్షమై నిలిచి భైరవుండు । అభిమతార్థంబు సాధకున
డుగు మనుడు॥ (వ) సాధకుండు భైరవుం జూచి యిట్లనియె॥ (సీ) సేవి
చ్చువరమేమి నేమిగోరెది దేమి యీబాంఛ్యమే నా కీశుఁడుండ। ననఘ
నీసారూప్యమసనలజ్జాశూన్యకడిభాగమున భయంకరపు రూపు।సాలో
క్యమనిననిచ్చు బురక్తశివసురామాంససంఘాత సమాకులంబు । సామీ
ప్యమేని పిశాచోగ్రఘోరతాళకాలభూతాదిసంకరతమంబు । నీవు ఋసంగి
నవరము నేనిచ్చగించ।వాంఛతో మత పదివేలవరములిచ్చు । నట్టి దయ
కాదెవక్రగుణంబువిడువు।వలదు వైషమ్యబుద్ధి యెవ్వారియందు॥(క) ప
రహితవర్జితకంటక।తరువులు ఫలవృక్షములకుఁ దానే వెలుఁగై। పరి
వేష్టించినవిధమున।గురుజనులకు నిట్టివక్రగుణములు దగునే॥ (క) పర
హితమును గైవల్యము । పరిమాన్పినఁబరహితంబు సమధికమైనన్। బ
రహితవర్తులెయుంభో । ధరపవనసుధాకరాది ధార్మికు లెల్లన్॥
(క) పరపురుషార్థగుణంబున।దరువులు పశువులును శిలలు తద్యముల
య్యెన్।పరహితకారిత్వముగల । పురుషుఁడు త్రిభువనములందు పూ
జ్యుండనఘా॥ (వ) అనిచెప్పి భైరవులీడొని సాధకుండుముందట నొ
కపుణ్యనదీప్రవాహంబుగని కృతస్నానుండై తత్తీర్థమాహాత్మ్యంబు

న దివ్యాంగుండైన తనదేహకాంతి దిగంతవిశ్రాంతంబై వెలుంగుచున్న దేహద్యుతిఁ జూచి హర్షించి ॥ (సీ) కమనీయమాణిక్యఘనకవాటో న్నతకలధౌతశివమయాగారమునను । మండితరత్నహర్మ్యస్థలాగ్రము నందుఁ గాంచనమయభేరిఁ గాంచియతఁడు । తద్దివ్యలింగంబు దర్శిం చి పూజించని భేరి వ్రేయించి సాధకుండు । నిలుచనంతటిలోన నీరజలో చనయుందుబింబానన యేగుదెంచి । సాధకోత్తముడెస నల్పిజలజము ఖుఖు । హావభావక్రియాదులనంగకళల । తరుణులాతని నైరావతస్థుఁ జే సి॥(వ) అనిచెప్పి యాదివ్యవైభవంబున కధీశ్వరుం జేయ నూహించి॥(ఉ) కోకనదప్రసూననవకోమలకాంతిపదస్వరాంగనల్ । కోకిల కంఠమా దవ సుఖోద్గమభాషలు కంబుకంధరుల్ । కోకసమానవృత్తకుచకుం భలు మత్తగజేంద్రగామినుల్ । నాకచకోరలోచనలు నవ్యవిహార వి లాసవిలాసవిభ్రమల్॥ (క) పంకజనయనలు కాంచన । కంకణమణిరవ ము లెసఁగ గలశంబులతోఁ । బంకజముల నిడియుదకమలంకారముతో డఁదెచ్చిలలనలు వేడుకన్॥ (క) మంగళవాద్యారవంబులు । మ్రుంగలమొఱ యఁగను పీఠముననవ్విభునిన్ । గంగాజలాభిషేకము । సంగతముగఁ జే సివిభవసన్నాహములన్॥ (గీ) మడుఁగువస్త్రంబులును గంధమాల్యము లును । పురుషునకునిచ్చి మాణిక్యభూషణములు । దొడిగిదివ్యాన్న పాన సంతుష్టుఁ జేయ । బహుళవైభవశాలియై పరిఢవించు॥ (గీ) అమరకాం తలతోడిసౌఖ్యామృతాబ్ధిననియ సుఖియుంచు నాచంద్రతారకంబు । అంత మీఁదట శాశ్వతంబైన ముక్తి । దివ్యసౌఖ్యానుభవములఁ జేజరిల్లు॥క॥ మరి శ్రీ గిరి సరిగలదను । వరుఁ తనుసిద్ధించు బ్రహ్మహత్యాదురితముల్ । ధరలోఁ బుణ్య స్థలి శ్రీగిరి ప్రతి గలదె స్వర్గమర్త్యపాతాళములన్॥ (శా) కాయం బున్ బెడఁ బాసి ముక్తియుతుఁడౌ । కాశీస్థలిన్ మోక్షసం । పాయిత్వం బు భజించు మానవుఁడు కేదారాంబువుల్ గ్రోలినన్ । కాయక్లేశము లే మిఁ జెప్ప సుఖియై కాయంబుతో ముక్తిఁ బొం । దాయాసంబులు మా ని శ్రీనగము శృంగాగ్రంబు వీక్షించినన్॥ (క) ఏగతి గలుగును యోగా । భ్యాగతులై యూర్ధ్వరేఖ యమివరులకు న ట్లాగతి మహిమము గల్గు

గును శ్రీగిరి వర్ణించు సకలజీవుల కెల్లఁ॥(సీ) ఏపర్వతంబున నెనసిన యవి సర్వలోకోపకారదివ్యౌషధములు। ఏగిరిపైఁ బ్రవహించి నదిస వంత లంబు గా సకలజన్మాంతరంబు। ఏమహాద్రిపై సమాహితగండశైలముల్ మందరకైలాసమహీధరములు । ఏమహీధ్రమున బంహిష్ఠ కాష్ఠంబులు సంజీవనీయు స్తంభనములు।తృణము లన్నియు దివ్యౌషధీగణములు। సిద్ధవనమూలికలు దేవసిద్ధికళలు।అట్టి మహిమాస్పదములకు నాలయంబు।బహుళపుణ్యోన్నతంబు శ్రీపర్వతంబు॥(ఉ)వేలుపుఁబేటితో మిసిమి వెన్నెల గాయు విశాల జూటితో।శైలజ బోటితోఁ గమలసంభవు చాయ కరోటి కోటితో।మేలిమి పేటితోఁ గరము।మించిన కీర్తి రమావధూటితో।నేలును శ్రీనగంబు గిరిజేశ్వరుఁడిష్టఫలప్రదాయియై॥(క)సారము శ్రీగిరి త్రిభువన। సారం బని శ్రుతులు చెప్పి చాటఁగ హంస। క్షీరమివాంభసి గతియగును।సారమె చెప్పను విశిష్టశబ్దార్థములన్॥ (వ) అనినఁ గృష్ణద్వైపాయనుండు ఆనందకందళితహృదయారవిందుండై దేవా తరువాతి కథావిధానం బెట్టి దని యడిగిన నమ్మునీంద్రునకు సనత్కుమారుఁ డిట్లనియె॥(క)సుజనఫలదా మరుద్రుమ।గజచర్మకటీపటీర కందర్పహరా।రజతగిరిశిఖరమందిర। భుజవర శ్రీప్రమథసంగ పర్వతలింగా॥ మాలినీ॥అసురనగరజైత్రా యద్రికన్యాకళత్రా।భసితలసితగాత్రా భక్తహృత్పద్మమిత్రా। అసమజలధితూణా యబ్జపుత్రీశబాణా। ప్రసవవిశిఖభంగా పర్వతాధీశలింగా॥ (శా)భవ్యస్వర్గనదీలుఠజ్జలచరభ్రామ్యత్తరంగచ్ఛదా। నవ్యాంభఃకణధౌతహాటకకళానంభాజటాజూట సం।సేవ్యస్తోకసుధాకరా గిరిసుతాశ్లిష్టార్ధదేహా భవా। దివ్యశ్రీగిరిశృంగమందిర మహాదేవా జగన్నాయకా॥

గద్యము॥ఇది శ్రీమల్లికార్జునకృపాలబ్ధవేదురాష్ట్రభాషా
విశిష్ట శివయోగగుణవర్య శేషనాధార్య ప్రణీ
తంబయిన శ్రీపర్వతపురాణంబునందుఁ
బంచమాశ్వాసము
సంపూర్ణము.



శ్రీ ర స్తు.

శ్రీమల్లికార్జున స్వామినేనమః.

# శ్రీపర్వతపురాణము - షష్ఠమాశ్వాసము.

శ్రీశైలపుణ్యమహిమల। నాశైలతనూజవినుచు నానందసుధా।రా శిరసకేళిఁ దేలుచు।నీశానునిఁ జూచి త్రిభువనేశ్వరి వలెకన్॥(క) శ్రీనగ పుణ్యసుధారస।మాని మునంబందె మానసాంబుజము సమా।ధానంబు నవికసించెను। ఆనతి నీవలయు నీకథా ద్యంతంబున్॥(వ)అని యడిగిన

—(❀)చేళికాబిలవృత్తాంతము.(❀)—

భావతీదేవికి నమ్మహాదేవుం డిట్లనియె దద్బిలసాధనక్రమం బెట్టిదనిన శ్రీపర్వతలింగంబును షోడశోపచారంబులం బూజించి యనుజ్ఞాతుం డై యరుగుదెంచి చలింప కాబిలాంగణంబున నిల్చి నిశ్చలచిత్తుండై॥(గీ) బావి విలసిల్లుతద్బిలప్రాంగణమున। వీరపుంగవుఁ డచట నిర్విఘ్నముగను।శంభుఁ బూజింపుచును లక్ష జపము జేసి।యతఁడు నిశ్చలచిత్తుఁడై యధివసింప॥ క ॥ ఎడపకను భావిలోపల। వడి నుదకము దాఁవ భాను వారమునందున్।కెడగూడి రుద్రసంఖ్యలు।వెడలున్ జెలి యపుడు దాను వేడుకయందున్।ఆచెలులు జలంబు స్రవం జూచిసాధకుండు॥క ॥ జలములు స్రావిన పిమ్మట।బిలమున కరుగంగఁ బాసి పిమ్మట వాలం।బలమి కొని పట్టి యాతఁడు।చలనం బింతయును లేక చన్యెన నంతన్॥సీ॥ ధర నిరువది యొకట ధనువంతరంబు లరుగంగ ముందట నతిశయిల్లు।కాంచనకుంభ సంఘటిత దీప్తులతోడ నభిరమ్యమగు హేమహర్మ్యమునను। భద్రాసనములైన భవలీలతోన్నత భద్రేభగామిని పద్మనయన। బలవ ధూమ్రకుపాణి పంచకల్యాణిని సైకతశ్రోణిని శక్తిఁ గాంచి। మానస

బుననిల్చి నమస్కరించి । భయముభక్తియు దీపింపఁ బ్రస్తుతించి ।
యింత ముందటఁ గొంతదవ్వరిగిలీర । పురుషపుంగవుఁ డొగిఁగాంచు
పురవరంబు॥ (క) హాటకగోపురములతో । హాటకమణిదీప్తప్రకాశ
నభిమత మంద౯।హాటకలింగము గుడిలోఁ।బాటలగంధులును జూచి ప్ర
మద మెలపడ౯॥ (క) పలుకులును జిలుక పలుకులు। కలహంసికగతు
లు సతుల గమనస్థితులు౯।కలువలును కన్నుగవలును।గలయకతోఁ బెం
మిసేయు కాంతలఁగనియె౯॥ అంతట॥ (క) ఆకర్ణాలోచనానవ ।
కోకనదప్రసవముఖులు కోకలనినదల్ । కోకకుచవిభ్రమంబుల।నాకవి
లాసినులు చేరి నరుగ గనంత౯॥ (వ) ప్రియాలాపంబుల సత్పరిసేవంబు
డిగియుచితాసనంబునఁ గూచుండి నియమంబున సాధకుఁ జూచుచున్న
నిపలుకునంత॥ (క) ఎచ్చోట నుండువు నామం।బెయ్యది పుత్త్రాంతమా
నఘ యెఱిఁగింపుమన౯।నెయ్యమునతో సాధకుఁడా।తొయ్యలులకు హా
ముదముతో నెఱిఁగించె౯॥ (సీ) కంకణఝణఝణత్కారంబు నూపుర
రావంబు మెఱయంగ రభసమునను । బుప్పొడిబోసి పుష్పోత్స
కంబుల నభిషేక మొనరించి యతులమైన । మణుగులు కట్టించి మంచి
పన్నీరును గొజ్జంగి పూసీరు గుంకుమంబు।పచ్చికస్తూరిగూడఁ బచ్చకర్పూ
రము మెదచిన గంధంబు మేన నలఁది । మగలి చుక్కలతో కోకలును
యయు కాంతి । గలుగ కట్టాణి ముత్యాల కంఠమాలి।పలుసు సువర్ణమా
ణిక్యకంకణములు । పుష్పమాలికలపించి పురుషుఁ జూచి॥ (క) సా
ధకుని యూహఁ బేరును।సాధకు తల్లియును దండ్రి సాధకకులమున౯।సా
ధనపత్రంబులచే । సాధనపత్రంబుకేల నతియిడిసంత౯॥ (క) ఆగ్యాతి
వ పసిఁడికిన్నెర । సాయన మిచ్చినను గొనుచుసాధకుఁడు నవ। ప్రా
యబలవిక్రమక్రమ।నాయతమహిమమున దివిజులై గపింపఁ౯॥ (శా)
నీరేజాసనుఁ డెంతనేర్పరిజయో నిందుడుండ వైవస్వతుం । డారాత్రిం
చరుఁడే బలాన్వితుఁడు తీవ్రాగ్నుండు తేజస్వి యే । శూరుండే యని
లుండు పాశధరుఁడు౯ సుత్రాముఁడే భోగివి। స్తారప్రక్రియ నేనెగాక

నిగ దాదండంబుచేఁ ద్రిప్పచుఁ॥ (వ) ఇట్లు వీరాలాపంబులు వలుకుచు దేవతాస్వరూపంబు ప్రాదుర్భవించిన మహత్వంబున నహంకరింపుచుండునంత॥ (గీ) అతివ నవ్వుచు సాధకు నగ్రవీధి । నిలిచి పత్రంబు చదువుమాని నిర్జరేంద్ర । యనుచు నిలిచిన దివిజవీరాగ్రగణ్యుఁ। డాత్మ లోపలఁ దెలియు వృత్తాంతమెల్లా॥ (క) ప్రంతలఁ జనివచ్చినగతి । యింతియు సానయము దనకు నిచ్చిన గొనక । త్యంతమహత్వము గలుగుట । నంతయు భావించి నాత్మ నెఱుఁగుచు నంతన్॥ (వ) వినయవివేకజ్ఞానంబును రూపలావణ్యవిలాసంబులుం గల నిర్జరత్వంబు గలిగి నిరంతరసంతోషాయత్తచిత్తుండై॥ (క) ఈచందంబున సాధకుఁ। డాచంద్రుని కాంతి గలిగి యమరబలబలుండై। యాచంద్రముఖులు దానును। నాచంద్రార్కము సుఖించు నానందమునన్॥ (క) శ్రీశైలపుణ్యమహిమలు। నాశైలతనూజ వినుచు నానందసుధా। రాసిరసకేళిఁ దేలుచు। నీశానునిఁ జూచి త్రిభువనేశ్వరి వలికెన్॥ (క) శ్రీనగమునఁ గల పుణ్య। స్థానంబుల పుణ్యశక్తి సాధనఫలసం। ధానములు తద్విశేషము। లానతిఁ గరుణింప వలయు నచలాధీశా॥ అనిన మహాదేవుం డకదళీవనమాహాత్మ్యంబు నిట్లని యానతిచ్చె॥ (సీ) శ్రీమల్లికార్జును సేవించి పూజించి యాదేవదేవు

—(*) కదళీవనప్రశంస. (*)—

ని యాజ్ఞపూని। శుక్లపర్వతమున శుద్ధాత్ముఁడై నిల్చి పంచోపచారప్రపంచరచన। సర్వలోకాధీశు శంభు నారాధించి కదళీవనంబు నీగతిని దెలిసి। మైరావతీనది నభిషిక్తుఁడై కల్పసరణి లక్షత్రయీజపము చేసి। మంత్రసంసిద్ధుఁడై భక్తిమార్గనియతి। నిత్యలింగార్చనక్రియానియతితోడ। సాధకోత్తముఁ డత్యంతసహజభక్తి। లీల నేతెంచి కను కదళీవనంబు॥ (సీ) కుందభూజములు ముకుందభూజంబులు చందనంబులు హరిచందనములు। రంభాదివనులు నారంభావనంబులు కుంభవృక్షంబు నికుంభతరులు। తాళవృక్షములు హింతాళవృక్షంబులు సాలభూజములు రసాలతరు

లు।కరవీరతరులు శ్రీకరవీరతరులును బిల్వంబులును జిరుబిల్వములున।వ
ర్ణభూరుహములు సువర్ణతరులు। కరజభూజంబులును బూతికరజ
ములును।వనము గుంపును నధికపావనము సొంపు। లికుచవనశోభనము
కదళీవనంబు॥ (సీ) మదనరంభాప్రజముహిళాకదంబాదిసహితమై దేవ
తాస్థలము వోలె। నమర మునీంద్ర గాయత్రిజపానేకసహితమయ్యును
బ్రహ్మసభయుఁ బోలె। వసుధ మాధవిరాజవరుణసుపర్ణాఖ్యవిరసమై
హరిసభావేది వోలె। జటిలాకర్ణహరిశివాశరభవబ్రహ్మసంచయముతై
నీశ్వరస్థళము వోలె।కౌశికాగస్త్యచిత్రశిఖండివితతి । సముదయంబుఁ
దాపసాశ్రమము వోలె।వనము గుంపును నధికపావనము సొంపు। లికు
చవనశోభనము కదళీవనంబు।(క)విటపఘనపల్లవచ్ఛద। పుటకళికాము
కుళపికచపుష్పపరాగో। త్కటమృదుశలాటుఫలరస।ఘటికద్రుమ మనుప
గాయకస్తుతి చెలఁగన్॥(శా) అత్యంతప్రతులాన్యకందఫలదుగ్ధాహారకు
క్షింభరుల్।నిత్యారాధకులు.భవ్యత్తిఃరతుల్ నీవారముష్టింపచుల్। ప్ర
త్యేకప్రమధుల్ ప్రబోధితపరబ్రహ్మైకవాచయముల్ । నిత్యాత్మల్ కద
ళీతపోధరవరుల్ షడ్చక్రపారంగతుల్॥(క)అతుయతరుదత్తోచిత।భిక్షాశ
ననియమరతులు ప్రియభక్తివిరూ।పాక్షు భజియింతు రట రు । ద్రా
క్షా మాకందకుందతరుభవనములన్ ॥ (క) ఉటజోపకంఠభూముల।
వటువులతో వేదభాష్యవాక్యార్థంబుల్ । విటపిశుకశారికలు వి।స్ఫు
ట వాఙ్మాధుర్యపదకశుద్ధి వరించున్ ॥ క ॥ స్థాణున కొసంగి వి
రు లా । ఘ్రాణించున్ తుమ్మెదలు శుకమ్ములును ఫల । శ్రేణిభు
జియించుమౌనులు । ఏణీంకధరోపహార మిచ్చినపిదపన్॥ (క) కద
లిశుకకోకిలంబులు।పదశుద్ధిఁ బఠించుఁ బ్రణవపంచాక్షరముల్।కదలి తరు
వీధిలోనవ। కదళిచ్ఛాశాశ్రితార్యకణోత్పలముల్॥ (గీ) అట్టివనభూ
మిగని పశ్చిమాంతరమునఁ।బుడమి పొడగంటినొక మహాద్భుతబిలంబు।ద
శిణయొక యోజనము మేరదాఁటి చనఁగ।వారి పూరితమగుసరోవరము
గలదు॥ (క) తెలినీరును తలిరాకును।పరికొ్రివ్వి తేనెవోఁగు పొడిన

త్రావుల్। చిలికింప కన్నదెమ్మెర। లలరులపై తేటిదాటు లానినసరసిన్॥
(క) సరసీకృతదురితహరా। త్ర్యరసీయుత్పన్నపాంత సురవరపాటీ। హం
ససేమోమృతపావన। సరసీతీరంబుఁజేరి సాధకుఁడంతన్॥ (సీ) అదె
సరోవరపావనాంబుమధ్యంబున నఘమర్షణస్నాన మాచరించి। సక
లాంగకములందు శాంభవమంత్రంబు నందుభస్మోద్ధూళనంబుఁజేసి। యా
నదీతటమునం దావిర్భవించిన సిలలోహితుని సన్నిధినినిలిచి। స్నానగం
ధాక్షతపత్రమాల్యంబులఁ బుష్పత్రిపుష్కరు పూజఁజేసి। చంద్రకోటీ
దినకరుఁ బదక్షిణము వచ్చి। కృత్తివాసునిగని నమస్కృతులొనర్చి। పక్వఫ
లములుదెచ్చి యర్పణము సేయఁ। గరళకంఠుఁడు కడు మెచ్చి గుణనశక్తి॥
(క) పజలన్యవంద్యాంఘ్రినయను। దుజలయపురదైత్యహరుచతుర్బాహు
యుతుఁ। నిర్జితపుష్పశరాసను। సజ్జనరక్షాకళా విచక్షణుశంభున్॥
(వ) అనుగ్రహంబువడసి యారుగన్నుందట॥ (క) కోరినకోర్కెల నొ
సఁగును। సిరిజడకెనయిన మొగలిజేలికిని మహా। చారగుణరత్నభూషి
త। దాయుజ్యపయోధిసముఖమున కరుగుటయున్॥ ఆమొగలిసిరక్తిమల్లి
నిమా॥ (క) సాకారమిష్టార్థంబు। సాధింపఁగ వలసి తెనిచ మ్యాసన
స్నన్। సానుసిధిఁ బూజ సేయుము। మాధుర్యాన్నములు దెచ్చి మత్ప్రి
యకగము త్॥ (వ) అనినవినిసాధకుండు సంతోషాయత్తచిత్తుండై॥ (క)
ఫలములుమెండుగ బ్రోవుగ। నిలిపిన ఘుజియించి మొగలి జేసిసయుసియుర।
స్థలమునఁగౌఁగిలించితను। తలచినవన్నియును గామితములు ఫలించున్॥
(క) మంటవిఘ్నము లెవ్వెడఁ। బొందవుగమనింపుమనిన భూయిష్ఠశి
వా। నందముగ నిన్నుఁగాంచును। నందనవన మర్థయోజనంబున సతిఁ
డున్॥ (క) ఆరామఫలాదులసుప। హారం బొనరించునట్టి యానరునకు
బృం। దారకసత్త్వమహత్త్వముచే। కూరును జిరకాలదేహశుద్ధియుఁ గ
లుగున్॥ (క) ఆకొలనిదక్షిణంబున। నాకోద్యానంబుఁబోలినరమణీయ
లీల। వ్యాకోచసత్రసస్ఫల। శ్రీకరమైయొప్పువనము సిద్ధాశ్రమమై॥ అవ్వ
నంబు నందు॥ (సీ) జంబీరఫలము భక్షణము జేసినవాఁడు జంభాసు

తారాతి సదృశుఁ డగును । వాతాజకఫలభుక్తి వలన సంభవమగు
సిద్ధీంద్రవిభవంబు సిద్ధి మహిమ । గంధవర్ణఫలరసగ్రసనంబు గావిం
ప గంధర్వులకునాది కర్తయగును। వన్యఫలంబు లెవ్వాఁడు భుజించిన
విద్యాధరాధీశవిభవ మందుఁ । గలుగు దాడిమఫల రసగ్రసనమునను।
ప్రబలసత్వప్రతాపంబు భానుదీప్తి । చూతఫలభుక్తివలన సంశుద్ధుఁ
డగును।తుహినకిరణునితోఁ దులదూఁగునతఁడు॥ (గీ) అందుహాటకత
రుఫలంబనుభవింపఁ। గైటభారాతిసదృశవిక్రమము గలుగుఁ । జెందు
కదళీఫలంబు భక్షించునతఁడు । విశ్వనాథునిసారూప్యవిభవమొందు॥
(సీ) అట గొంతదూర మందరుగంగముందర మహిమంద నొప్పు నా
మలకవనము। ఇంద్రనీలచ్ఛాయ నెకసక్కెలమాడెడు పరిపక్వఫలకదంబ
ములు గలిగి।అందులో నొకఫలంబనుభవించిన యట్టి ఘనునకునింద్రభో
గములు గలిగి।దానసమీపమునబిల్వవనంబులుగల్గు ఫలముభుజించినఁ బ్ర
మథుఁడగును।దక్షసమీపంబు ఫలపూరతరువులందు । ఫలము సేవింపయ
క్షేంద్రపదము గలుగు। మఱియునత్యంత పావనమహిమ నొప్పు।బహు
శచిత్రాభిరామంబు ప్రథమకదళి॥ (క) ధరణీమహావనసజీర। హరిణీ
నయనానుపాలసౌషధములన । ధ్ధరణీకృతసంజీవన। కరణీనివహము
లుప్రథమకదళీవనముల్॥ ప్రథమకదళిం బ్రవేశించు విధంబెట్టిదనిన॥(గీ)
జనులుపూర్వోక్తసరణిమజ్జనమొనరిచి । గరళకంఠుని పూజించికల్ప
సరణి।శైవమంత్రంబు మూఁడులక్షలు జపించి । దివ్యసరసికి నటతూ

—(*)ప్రమథకదళీవన వృత్తాంతము.(*)—

ర్పు దెసకుఁ జనఁగ॥ (గీ) అంతముందట శక్తిసింహాసనంబు। జేజరిల్లు
ను నెనిమిదిదిక్కులందు । ఖడ్గసంజీవనీఘుటికావశిత్వ। పాదుకామృతవ
జ్రిసంప్రాప్తకళలు॥ (గీ) సాధకోత్తముఁడటఁజూచి సాహసమున।నం
దులోపలవలయు ద్రవ్యంబుగొనుచు । నంతటముందటఁ గొంత దవ్వు
రిగిచూడ।నతిశయిల్లును దేవతోద్యానవనము॥ (క) విమలస్వర్ణద్యుతు

లా।ద్యుమణిమయూఖములసొంపులో దులకింపఁగ। బ్రమధాధినాథుగిరి జా।రమణచతుర్ద్వారమందిరము శోభిల్లున్॥ ఆమందిరంబునందు॥(క) హాటకలింగము కనకక।వాటద్వారములయందు వసియింతురుశౌ। ర్యా టోపయుతులు వితరణ।పాటలవర్తనలు ద్వారపాలకముఖ్యుల్॥ (క)నా కేశదానవాదుల।చేకొనని పరాక్రమప్రసిద్ధోన్నతిచే।శ్రీకంఠు హేమగే హము।వాకిటనుండుదురు శౌర్యవైభవమతులై॥ (క) నిగమాగమార్థఁ వినతుని। నగజాధీశ్వరునిదక్షిణద్వారమునన్ । మగటిమినుండును భైర వుడగణితఫలవిక్రమక్రమారావములన్॥ అంతట॥ దక్షిణద్వారభూమి సాధకుఁడు నిలువ।నుగ్రరూపంబుతో భైరవుండు వలుకు। నెందుఁవచ్చెద వోరోరి నీవిచట నిలువు । సురలకైననునీకుడి చొరఁగరాదు॥ (క)అన వుడువిని సాధకుఁడును। ననవరతధ్యాననిష్ఠ నచలితభక్తిన్। వినుతింపు చుండు భైరవుఁ।డనుకంపను ఖేచరత్వ మతనికి నొసఁగున్॥వ॥మఱియు నాసాధకుఁ డుత్తరద్వారంబున కరుగ నకడనున్న దేవాంగన యిట్లని యె॥క॥ అధముఁడ యిటు నిలువుము।విధమెకడ శివునిభక్తి విధమె కడదు।ర్విధులకు మెచ్చఁడుశంభుఁడు । బుధులకు నీనగరిపొంతఁబో రాదు సుమీ॥గీ॥ నారీరత్నము ప్రస్తుతింపవిని యానందంబు సంధిల్లఁ గా।హారంబిచ్చిన కంఠకోణమున నాహ్లాదంబుతోఁ దాల్ప ని।ట్లారీతిన్ బ లవంతుఁడై యతఁడు వాగీశత్వమున్ బొందిగం।భీరజ్ఞానకళాకలాపము లజృంభించున్ ప్రతాపోన్నతిన్॥అంతసాధకుండు పశ్చిమద్వారంబునకరు గునంత॥క॥ఆతతసప్తఫణామణి। జాతోన్నతకాంతియుతుఁడు సంపూ ర్ణబల।ఖ్యాతభయంకరదేహుఁడు।భూతేశ్వరు భటుఁడు భుజగపుంగ వుఁడుండున్॥(వ)ఆభుజగాధీశ్వరుండు సాధకుంజూచి గంభీరభాషణం బుల నిట్లనియె॥ (క) బలిచెలి నెకడి కేగెదు । కరికరి యిటునిల్వ వట్టి గవణం బేలా । కెలిమాటలకును మెచ్చఁడు। గరకంఠుఁడు సహ జభక్తి గతులకుఁ దక్కన్॥ (గీ) అధమమానవ నామాటయధిగమిం చి । చనకయిటు నిల్వుమనియు నెచ్చటనె యుండి। ప్రణుతిఁజేసిన నో

సఁగు నప్పావకేందు॥ దివిజరూపంబు బలమున దృశ్యకరణి॥ మరియు పూర్వద్వారంబున॥ క ॥ మవారరదనుజదమనుఁడు। గీర్వాణమునీం ద్రనుతుఁడు కీర్తితశౌర్యా । ఖర్వాత్మ్యైకదంతుఁడు । ఉర్వీజనవ రదుఁడుండు నుత్తమహిమన్।దత్ప్రదేశంబున కరిగి సాధకుండు॥సీ॥ వామతనుని ప్రాగ్ద్వారపాలుని దివ్యమునివంద్య నేనుఁగు మొగము వే ల్పు।గనుగొని వీరాగ్రగణ్యుండు సంతోషభరితుఁడై నిజభక్తిఁ బ్రస్తుతిం చి । పత్రపుష్పంబుల వలనొప్పఁ బూజించిపక్వఫలంబు లర్పణము జే సి।సామజవదనుని సన్నుతిగావించు దేవాదిదేవు మందిరముసొచ్చి। దురి తసంహారు నభవుఁబ్రద్యోతమాన । పరమసంతోషతనుపరబ్రహ్మరూ పు।హాటకేశ్వరదేవు నత్యంతభక్తి। గాంచిపూజించి వీరాగ్రగణ్యుఁడం త॥క॥ఆదేవదేవుగుడిలోఁ।బాదుక సంజీవనీప్రపంచజవత్త్వా। పాదకఖ డ్గామృతరస । నాదవయస్తంభమూలవర్గము లుండున్॥ మఱియు॥ (క) వలసిన వస్తువు లెల్లను।దలఁచిన వన్నియును వచ్చి తనసన్నిధికై। నిలువఁ గల మూలికాదులు । తలఁపనగోచరము ద్రవ్యతండము లుం డున్॥ (వ) అధికతేజంబునం బ్రకాశింపుచున్న ద్రవ్యంబులు చూచి హాటకేశ్వరదేవు ననుగ్రహంబువడసి వలసినమూలికాద్రవ్యంబులు గై కొని యప్రతిమభావంబునఁ బ్రమథమహత్వంబు గలిగి విహరింపుచుండె నంత॥ క॥ నీరజమిత్రుని తేజము। నీరజసంభవుని నేర్పు నిర్జరబలమున్। స్వారాజ్యవైభవంబును। సీరిక్రై కొను నెవేల్పు శిరులున్ బాదలన్॥ గీ॥ ఇవ్విధంబున సాధకుఁడేగుదీర। నిట్టునిష్టార్థసిద్ధులు ఇచ్చునట్టి। యతివి చిత్రంబులైనయుద్యానపుణ్య। వనశతంబున సీమహత్వంబుగల్గు॥క॥ ఈ రీతినధిగమింపుచు। వీరాగ్రవరుండుగాంచు విశదంబునబ్బం। దారకదివి జసంయుత।ద్వారంబునఁ గలుగుబద్మవతిబలమనఁగన్॥ గీ॥ సాధకుండ

## —(*) పద్మావతీబిలప్రశంస. (*)—

చటఁగల్పోక్తి జపముఁజేసి।మంత్రనిష్ఠను ఘనధనుమూనఘోరాది। చనఁ

గఁగాంచనశృంఖలాసహితమైన। కాంతిఁజూపట్టు నొకభేరిఁగాంచి నిలి
చి॥ (క) స్వర్ణమయదండమున భువి।ఘూర్ణిల్లఁగ భేరిబుగులుకొన
వాయింపన్। కర్ణములు మోఁతసోఁకను।వర్ణనసల్లోకలనుబోలు వారి
జనములన్॥ ఉభయ భాగంబులంగొలువ పద్మవతీకాంత యేతెంచెనం
త॥ (క) మారుసతిచక్కఁదనమును।దోరణకట్టంగఁజాలు తొయ్యలిర
మ్యా।కారంబును లావణ్యము।చీరికిఁగైకొనని పెంపు చెలువఁసొబగున్॥
(సీ) మరువంపుదిమ్మెయో మావిపూగొమ్మయో మత్తచకోరమో మంద
నుశరమొ। కందర్పదంతియో కల్వపూబంతియో కనకంపుదీఁగయో
కాంత వాగు। పొలఁతియో పచ్చకప్పురపుస్థలాకయో కోమలమాకాకు
కొమ్మెయుంగా। రాజానురూపమో రత్నప్రదీపమా నెవ్వాంగనల్లన
యభినుతింపఁ। గనకకంకణఝుణఝుణతారగములను। రత్నకీలితనూప్రు
రారావములను। దంతకాంతులు చెకుటద్దములదీప్తు। లంతకంతకు
నొండొండనతిశయిల్ల॥ (క) ఎదురుకొని యపతనిఁదమపురి। సదనంబున
కరుగుమనుచు సయ్యాటములన్। ముదితలుదోడ్కొని చనఁమణి। సదవీరి
కనుంచి దేవభామినియంతన్॥ (క) ఆతనియూరును బేమను।నాతనిద
ల్లియును దంగ్రి యభిధానము లిట్లాడలతనిచే వ్రాయించిన। నాశాళి
తపత్రమునవ యంగుళి నిడుచున్॥ (క) ఆయమరవ యమృతతుల్యర। సా
యనమిచ్చినను గొనుచు సాధకుఁడును సౌ। ఖ్యాయత్తచిత్తుఁడై కొ
ని।ధీయము సత్వమున దివ్యదేహముఁ బొందెన్॥ (వ) అంతఁ దనకు దే
వతాసత్వంబు సంభవించిన సర్వశౌర్యసామర్థ్యంబులు గలిగిన విజృం
భించె॥ (శా) సంకేజాసనముఖ్యులన్ దొరసి శుంభత్తేజుఁడై విక్రమా।
టంకారప్రతిమప్రతాపమును నుల్లాసంబు సంధిల్లని। శ్శంకాలాపము
లాడుచున్ బలయశస్సామర్థ్యసమ్యక్ర్కియా। హుంకారంబునఁబొందె
యాతఁడు గదాహస్తాబ్జమున్ ద్రిప్పుచున్॥ (ఉ) ఎక్కడి పాకశాస
నుఁడు నుక్కడి వహ్నిపరేతరాజు వీఁ। డెక్కడి రాక్షసేశ్వరుఁడు
నెక్కడి పాశధరాధినాథుఁ డిం। కెక్కడి యక్షనాయకుఁడు నిన్ని

జగంబులు చేయఁ బ్రోవఁగా । నిక్కము నేనె కర్తనని నిష్ఠుర వృత్తి న
హంకరింపుచుఁ॥ (క) ఆలేమనగుచు నాతని। వ్రాలొచ్చినను జనివి వ
చ్చిన విధముఁ । జాలించి మెఱఁగి గర్వముఁ। జాలించి యందు ని
గులశాంతి వహించుఁ ॥ (వ) వినయవివేకజ్ఞాన సత్వశౌర్యంబులును
రూపలావణ్యవిలాసంబులును నిజరత్వంబు గలుగుటకు అత్యంతసంతో
షాయత్తచిత్తుండై॥ (క) ఆరాజముఖుల సంగడి। నారవిచంద్రార్క
మతులితైశ్వర్యకళా। పారసుఖకేళి దేలుచు। వీరోత్తముఁ డల్లనిల్లు వి
భవాన్వితుఁడై॥ (క) తొమ్మిదికదళీవనములు। తొమ్మిది పురములును న
దులు దొమ్మిది బిలముల్। తొమ్మిది యమృతప్రవాహులు । తొమ్మండ్రు
పురాధిపతులు దొంగలయుక్తుల్॥ (గీ) కదళి మొదలైన దివ్యలింగస్థ
లముల । గలిగి సురమును లచిరంతు రర్ధరాత్రి। సమపాటుండున వే
దఘోషములు చెలఁగఁ । బరమవిశ్వాసతాత్పర్యభక్తినోడ॥ (క) ఘం
టలఘునాఘనధ్వని। శంకాద్యంకరణశంకజర్ఝరభేరీ। భాంకృతులు చె
లఁగ నమరులు । శంకరుఁ బూజింపుదురు నిశాసమయమునన్॥ (క)
శ్రీగిరిపుణ్యమహత్వము। వాగీశునకైన శేషవాసుకులకును నుద్యోగించి చె
న్నశక్యమె । శ్రీగిరినాయకుఁడు ఎఱుఁగునెప్పుడే యెఱుఁగన్॥ (సీ)
శ్రీగిరిపై జనశ్రేణుల లీలావిరాంబుల శ్వమేధాధ్వరములు । ఎవ్వఁడు
గావించు నిష్టసల్లాపంబు మాహేశ్వరప్రోక్తమంత్ర మదియు । జనులు
ఇచ్ఛాభోజనంబు చేయుట యంబికాధీశు సమర్పణములు । నిద్రావి
హారంబు నీలలోహితపదధ్యానధారణమున మాననియతి । యిందు వ
ర్తించు లుబ్ధకు లమరవరులు। ఉదక మంతయుఁ బుణ్యగంగోదకంబు ।
సంతతంబును శ్రీగిరిజంతుహస్త। వనరుహంబున నుండుఁ గైవల్యలక్ష్మి॥
(క) సిరిగిరి నలుగడలందును। బరఁగిన శిలలెల్ల లోకపావనమహిమ ।
స్ఫురణమున నరుఁడు గోరిన। సిరులొసఁగన్ జాలునట్టి శివలింగంబుల్॥
(శా) పాటింపన్ దగుముజ్జగంబులఁ బురప్రత్యర్థిజూటాటవీ। కోటీ
కోటరపావనామరధునీ ఘూర్ణాంతరంగావళీ । వ్యాటీకాయిత వేణు

కానికరసమ్యక్పుణ్యతో మెచ్చముల్ । చాటుత్వంబు వహించు శ్రీనగ
ముపైఁ జంచర్ఝురశ్రేణికల్॥ (సీ) భూతదయాలీలభూమిప్రదక్షి
ణత్రయసంభృతంబగు ధర్మఫలము। కలుషేతరక్రియాగంగానదీస్నా
నములు రెండులక్షలు గలఫలంబు । హేమనగమునుబంహిష్ఠవర్త
నసల్పు కోట్యఘమర్షణస్నానగుణితఫలము । సులభంబున నెగల్గు శు
భపరంపరలు శ్రీధరణీధరేశు సందర్శనమున । సుచితభక్తిక్రియారా
తిరోకహేళి । శ్రీనగాధీశుని యతిబూజించునతఁడు । దుష్టజన్మాం
తరార్జితదురితకర్మ । తతులఁదొరఁగును వాంఛితార్థములుగ
లుగు ॥ (గీ) అతఁడు కేదారమున వింశతియుగలుఁగు। భక్తిజరియిం
చుగయను ముప్పదియుగములు।యుగము లెనిమిదికాశిలో నన్నఫలము।
నొక్కదివసంబు శ్రీగిరినున్నఁగలుగు। (వ) పద్మప్రదక్షిణంబునురామ
ప్రదక్షిణంబును నను రెండుదెఱంగు లీప్రదక్షిణంబు లాచరించిన వారికి
సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యపదంబులు సంభవించు॥ (క)
శ్రీపర్వతప్రదక్షిణ మోపిచరించినను గోకుర్ల లొసఁగునుశంభుం। డా
షంకేరుహగర్భ। శ్రీపతిసంక్రందనాదిసిద్ధిపదంబుల్॥ (మ) శిరసాక్రమం
బున పార్వతీశుని మదిఁ సేవించు పుణ్యాత్ముఁడే। గిరికన్యాక్రికళత్రక
ర్ణప్రీతిలంబోదరో। త్కరహేరంబ కుమారభృంగిరిటినిష్ఠం పాదు
లకనందికే। శ్వరునిఁజూచి ప్రియంబునన్ గనుఁగొనన్ సర్వేశ్వరుఁడు
న్నాడే॥ (క) అహముజాదివిశంకట।బహుదోషపునర్భవప్రపంచసముం
చ। దహనస్థలిదిక్ఛ్రిమగతి।విహరింపరు శ్రీనగప్రవేశధురీణుల్॥ (క) సిరిశై
లంబుననియతిన్।జరియించువిశిష్టపుణ్యచారిత్రులకన్।కరతలమునసిరుపా
ధిక। నిరుపమకైవల్యలక్ష్మి నెలకొనియుండున్॥ రగడ॥ శ్రీగిరినాయకు సేవిం
చెదనని। శ్రీగిరిసన్నుతి చేసెద నేనని। శ్రీగిరితీర్థశ్రేణికగతియని। శ్రీగిరిపుణ్య
విశేషస్థితి యని। శ్రీగిరిఘనని శ్రేయసకరమని। శ్రీగిరితాపసజనభాస్వర
మని। ప్రమథవల్లభోపాసన మిది యని। పరమధర్మపరిపాలన మిదియ
ని గిరిశభక్తజనఖేలన మిదియని। పరతత్త్వస్థిరభావన మిదియని। దారుణ

జన్మలతాలవిత్ర మని।బహుకర్మాంబుధిపటు పవిత్ర మని భక్తజనుల కి
హపరసాధన మని।ముక్తికామికి ముఖ్యదపట్టణ మని। అనుపమభక్తిసమ
పట్టణ మిది యని।పరశువేదికిని భవనస్థల మని।చింతామణుల విచిత్రస్థ
ల మని।సంజీవనులకు జన్మదేశ మని। సురమునివరులకు సుఖనివేశ మని।
సకలామరులకు సన్నిధాన మని।లాలితభక్తికళావిధాన మని।తలఁచు జ
నుల సంతానకతరు వని।ప్రణుతార్థులకును పారిజాత మని। సేవకత
తులకుఁ జింతామణి యని కామితార్థులకుఁ గామధేను వని। తరశా
ఖాంబుధితారక మిది యని।కరణీయశోధనకారణ మిది యని।రచితకలు
షకర్దమశోషక మిది యని।మలహరుసేవకమంతన మిది యని।శివభక్తవ్ర
జచింతన మిది యని। మోహవల్లికామోచన మిదియని। బహువిధకల్మష
పావన మిది యని। భక్తావనవరభాగధేయ మని।గిరిశభక్తులకు గిరికల
శం బని।సకలాఘాంబుదచయసమీర మని। గురుతరపాతకకుజకుఠారమ
ని।అతులితశివధర్మావతార మని సకలమునీశ్వరజనవిహార మని। భావము
లో నిది భక్తిఁ దలంచిన।సజ్జనపాదపజలదము శ్రీగిరి।ఘనపురాతనగ్రా
మణి శ్రీగిరి।సకలామరరక్షామణి శ్రీగిరి। సేవకమందరసేవధి శ్రీగిరి।శోభిత
పుణ్యయశోనిధి శ్రీగిరి। కారణజగదుపకారము శ్రీగిరి।ముఖ్యపుణ్యఫలమూ
లము శ్రీగిరి।మాహేశ్వరజనమాన్యము శ్రీగిరి। శ్రీగిరిఁ దలఁచు విశేషజ్ఞు
లకును।సప్తజన్మదోషము దొలఁగు నని।చాలను బలుకును సకలశ్రుతులు
ను।ఇది శ్రీగిరిపతిహితసన్నిధి యని।యిది పఠియించిన నిహపరసుఖమని॥
అని స్తుతియించి యిట్లనియె॥(గీ) ఎన్నిదానంబులవనిపై నెన్నఁ బడును।
నెన్ని ధర్మంబు లవనిపై నెన్నఁ బడును । అవియు వేదోక్తముగఁ జే
యు నట్టి ఫలము।సంభవించును నీకథాశ్రవణమునను॥అనుచు॥ (గీ)నలిన
సంభవసుతుఁడు సనత్కుమారుఁ।డనుమతింపఁగను బరాశరాత్మజుండు।
సకలమునులను సంతోషజలధిఁ దేల్చి। యుత్సవంబున వతిఁగాంచుచుండిరం
త॥(క)గీర్వాణశైలకాముక। అవాఙ్చీనస్వరూప యబ్జభవాంబా। శ్రీ
వాఙ్మనరితహిమవ।త్పర్వతపుత్రీనిజాంగ పర్వతలింగా॥

## శ్రీపర్వతపురాణము- షష్ఠమాశ్వాసము.

మా లి నీ.

సుజనసురమహీజా శుద్ధలింగాను తేజా నిజకుళలసమాజా నిర్జితశ్రీ తనూజా।వ్యజనభవవిభంగా వేదరంగ త్తరంగా।జననిపుణగంగా పర్వతాధీశలింగా॥స్రగ్ధర॥ జంభాదిటుటింభజాంభోజంభముఖదివిజస్వాంత నాళీకపద్మా । శుంభత్తుంభీనసేంద్రస్ఫుటకటకరసచ్ఛోభనాంఘ్రిప్రవరద్వా।గంభీరాంభోధికన్యాఘనకుచయుగళీకాంతిమద్బాణగుప్తా। దంభావష్టంభ మోహాతరవిభవమనస్థానకశ్రీగిరీశా॥

గద్యము॥ఇది శ్రీమల్లికార్జునకృపాలబ్ధమేదురాష్ట్రభాషా
విశిష్ట శివయోగిగుణవర్య శేషనాధార్య ప్రణీ
తంబయిన శ్రీపర్వతపురాణంబునందుఁ
సర్వంబును షష్ఠమాశ్వాసము
సంపూర్ణము.
శ్రీభ్రమరాంబా మల్లేశ్వరార్పణ మస్తు.

---

